## ఈ నాటకమున వచ్చు పాత్రలు.

### [పురుషులు.]

1. పురూరవుడు—కథానాయకుడు.
2. సోమదత్తుడు—జయప్రదతండ్రి.
3. రాజులు { కేరళ దేశాధీశుడు / మాళవ " / పాంచాల "
4. సంతానవంతుడు, ధర్మశీలుడు } పురూరవుని కుమారులు.
5 ఆనందుడు—నవకోటి నారాయణుని మైత్రి
6. నవకోటి నారాయణ—వైశ్యుడు.
7. కరణీకుడు—మారుపేరుతోనున్న పురూరవుడు
8. గొల్లవాడు— " "
9. కలి—
10 జయంతుడు—పుష్పవేణితండ్రి
11 మంత్రి—జయంతుని మంత్రి.
12 దేశికసెట్టి—వైశ్యుడు.
13 దైవికమహారాజు—మారుపేరుతోనున్న పురూరవుడు.
14 ఉశరిష మహాఋషి.

### [స్త్రీలు.]

1. పంకజవల్లి—సోమదత్తుని భార్య.
2 జయప్రద—కథానాయకి. సోమదత్తుని కూతురు.
3. శ్యామలత—జయప్రద దాసి.
4. చెంగి—గొల్లది.
5. ఆకాశవాణి—దేవత.
6. పుష్పవేణి—జయంతుని కూతురు.
7. ప్రియంవద—పుష్పవేణి చెలికత్తె.



# శ్రీపురూరవః

## ప్రథమాంకము.

రంగము:— (మందిరములో శయ్యపై జయప్రద ప్రవేశించును.)

జయ — (తనలో) ఆ లోకైకవీరుఁడును- జగన్మోహన స్వరూపుఁడును- చక్రవర్తియు నగు పురూరవుని నేను చేకొనఁగలుగుదునా ? అతఁడు నన్ను వివాహ మాడుటకు సమ్మతించునా ? అతనిఁగూర్చి నే నీవిధమునఁ బరితాప మందుచుంటినని యెవ్వ రెఱిఁగింతురు?

సీ॥ నినుఁగూర్చి యాలించి • నీమీఁదఁ జిత్తంబు
నిలిపి యుంచితిఁ గాన • నంఘు కరుణ
నన్నుఁ జేకొన రమ్ము • నరనాథ మఱు లెల్ల
వినుతింప యంచును • వేడ్కతోడ
వార్త బంపింతునా • పంపంగఁ గల్గిన
దవ్వుగా నియ్యది • తలచునేమొ
కంపింపకున్న నా • భావ మా భూమండ
లేశ్వరుం జేరితి • నెఱుఁగ గలఁడు

గీ॥ ఏమిసేయుదు నింక నా • కేది మార్గ
మెవరితోఁ జెప్పుకొందును • నెవరు నాదు
తాప మార్పంగ జాతురు • ధరణి విభుని
దెచ్చి నామది నున్నట్టి • యిచ్ఛఁ దీర్చి॥

ఆ పురూరవుని దివ్యమంగళ విగ్రహము నాహృదయఫలకమున లిఖించుకొని యుంటిని. అబ్బా! అతని నామస్మరణ మొనర్చినంతనే నామేనఁ బులకలు వొడముచున్నవి. స్వయంవరము చాటింపఁబడినది కదా యిఁక హృదయము పదిలపఱచుకొందమన్నను నాకు వశముగాక యున్నది.

సీ॥ అరయ మత్సుత స్వయం • వరమున కరుదెంచ
టంచు ముదంబున • నఖిల నృపుల
నాహ్వాన మొనరఁ బంపి • యలక్ష్యగాక మదీయ
జనకుండు, వృద్ధిల్ • సంతసమున
వీక్షించి వరుని గొనఁ • జేరాసఁ జూపుచు
క్షితినాథు లెల్ల వ • చ్చెదరు గాక
వచ్చిన నేమాయె • భావంబు హరియించి
నట్టి పురూరవుం • డనని యెంచు
గీ॥ చక్రవర్తి యగుటఁ జేసి • స్వాంతమందు
దనకు సాహసాత్క రాజ సు • తనగు నన్నుఁ
దగుణిగాఁ గొనఁ దలచునో • తేఁ దలఁచునో! మ
దీయ భాగ్య మెట్లుండునో • తెలియ రాదు॥

ఆ నవమోహనాంగుని చరణదాస్యము నాకు లభింపకయున్నచో నాజన్మ వ్యర్థమేకదా!

[ శ్యామలత ప్రవేశించును. ]

శ్యామ — చెలీ! జయప్రదా! నీవింకను నిట్లుంటివేమి? రేపు స్వయంవర మహోత్సవమను మాట మఱచితివా యేమి?

జయ — అగుఁగాక! నాయుద్దేశము నెఱవేరినప్పుడుకదా నాకు సంతోషము కలుగుట.

శ్యామ—నీ యుద్దేశ మేమి?

జయ—సఖీ! తెలియనట్లడిగెద వేమి?

శ్యామ—సరేలే! పురూరవునిగూర్చియేనా నీ పరితాపము. అందుకై యింత బెంగయేల?

జయ—నీ వట్లు వచించిన నే నేమనగలను.

గీ॥ అస్మదీయ చిత్తము హరించి • నట్టి భూమి
నాథుఁడు పురూరవుండు నా • నాథుఁ డగుచు
గాఁడెల భాగ్యంబు నాకును • గలుగ దేని
యడవిఁ గాచిన వెన్నెల • వడువు గాదె
నాదు సౌందర్య మెల్లను • నాతి మిన్న!

శ్యామ—ఇది యేమి సఖీ! నీ వాతనిని వలచితివి. అతఁడుగూడ నీయం దట్లె చిత్తముఁగొనవలయునుగదా!

జయ—స్వయంవరమున కాతఁడు విచ్చేసెనేని నే నాతనినే వరించెదఁ గాక! అతఁడు సమ్మతింపఁడా! నాయెడలఁ బ్రేమఁజూపఁడా? పోఁ నిమ్ము అమ్మహాశయుని చరణదాస్యమునైనఁ జేసికొనుచు గృతార్థురాల నయ్యెదను.

శ్యామ—అతఁడు స్వయంవరమునకు రాకపోయినచో నీవేమిచేయ గలవు?

జయ—శ్యామలతా!

మ॥ గరళంబుం ద్రావెద గోళ్లసెంచినను ఖ • డ్గంబైనఁ జేఁ జిక్కదే
యురికిం ద్రాఁకులు లేకయున్నవె! మహా • ఘోరాసులుం గల్గవే
ధరణీశాగ్రణియా పురూరవుఁడు మో • దంబార నన్ జేకొనం
గ రహిన్ జేరకయున్న నియ్యెడకు ని • క్కంబిద్ది నాఁ డిచ్చితిన్!

శ్యామ—సఖీ ! అంతమాటయేల ?

అను (1)

మ॥ తరుణీ ! చింతిలనేల యీగతిని మో • దంబారగా రేపె యా
ధరణీశుం డరుదెంచుఁ దప్పక యిఁకన్ • దథ్యంబుగా వానినిన్
వరియింపంగల వీవు నీదు పరితా • పంబెల్ల దీరంగ మా
కరయన్ మోదముగల్గఁ జింతపడ క • మ్మా! మానసాబ్జంబునన్॥

జయ—శ్యామలతా ! నేనంతటి భాగ్యము నోచుకొనియుంటినా ?

శ్యామ—జయప్రదా ! నీవు సంశయింపఁబని లేదు. ప్రతిష్ఠానపురనివాసియు, రాజాంతఃపురమున మెలంగుచుండు వృద్ధదాసియు, మాకు జుట్టమును నగు నొకతె, నేడు మాయింటి కరుదెంచి, పురూరవ చక్రవర్తి యిటకు స్వయంవరార్థము వచ్చుప్రయత్నమున నున్నాడని చెప్పినది. అదియుంగాక, భవదీయ సౌందర్యాది గుణములను గూర్చి యిదివఱకే యాతడు విని విరాళిఁ జెందియున్నాడని కూడ వినియుంటిని.

జయ—నీమాటలు సత్యమేనా ?

శ్యామ—నే నెప్పుడయిన నసత్యమాడియుంటినా ! కాని యొకవిషయమై మాత్రము సందియము కలుగుచున్నది.

జయ—సఖీ ! ఆసంశయమేమి ?

శ్యామ—మఱేమియును లేదు. చక్రవర్తియగు నా పురూరవునిఁ గైకొనినపిదప, బాల్యమాదిగ నీకుఁజెలినై యున్న నన్ను మఱచెదవేమో సుమా !

జయ—సఖీ! ఎంతమాటఁ బలికితివి. నాకునీపైనున్న ప్రేమయెఱుగవా?

శ్యామ—అమ్మా! నేను వచ్చినపని మఱచిపోయి యిక్కడ కాలహారణము జేసినాను, మీతల్లిగారు నిన్నుఁ జూడదలచి వేచి యున్నారు. సత్వరముగరమ్ము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

రంగము:- విశాలపురము, స్వయంవర మందిరము, సోమదత్తు డు, సుమతి, పురూరవుడు మొదలగురాజులు ప్రవేశించు చున్నారు.)

సుమ—(సోమదత్తునిఁజూచి) స్వయంవరార్థము రావలసిన నృపాలు లందఱునువచ్చి యుచితాసనముల నలంకరించి యున్నారు. స్వయం వర సమయముకూడ నాసన్న మగుచున్నది.

సోమ—అట్లయిన మన జయప్రదను సత్వరముగ దోడ్కొని రమ్మని శ్యామలతకుఁ దెలుపుము.

సుమ—(నిష్క్రమించును)

సోమ—(సభంగలయఁజూచి) నృపాలులారా ! నాయందు మిగుల ప్రేమయుంచి మీరందఱును స్వయంవరమున కరుదెంచుటంజేసి నేను కృతార్థుఁడనైతిని.

సుమ—తండ్రీ ! జయప్రద వచ్చుచున్నది.

పురూ—(తనలో) నా హృదయమును హరించుచున్న శరదిందు ప్రతిమాన సుందరాంగి వచ్చుచున్నదికాబోలు- (ఎదుట) అదిగో- చేటీ పరివృతయై- వచ్చినది.

[ జయప్రద శ్యామలతతోఁ బ్రవేశము ]

పురూ—(తనలో) ఆహా ! ఏమి ! ఈసౌందర్యము ! అను॥ (2)

సీ॥ వలయుత పరివార • జలదాంతరంబున
దీపించు క్రొమ్మించు • తీవ యనఁగ
నబ్ధి మథన ఘన • యత్నంబునఁ బ్రావిర్భ
వంబు నందిన రమా • బ్జాస్య యనఁగ
నఖిల భూవర హృద్బ్ధి • దార్థంబు విధి సృజి
యించి పంపించు మో • హిని యనంగ
నిజ నాథు డాయ, హ్ర • స్నీరజంబున నెంచి
రహిఁ నేగు దెంచెడి • రతి యనంగ

తే|గీ|| వేశ్యతోఁ జెల్మి కత్తెయు • వెంట రాగ
తారలను బోలు పూదండ • దాల్చి హస్త
మున నయనపర్వ మొనరింప •ఁ బూవుఁ బోడి
రాజసుత వచ్చెఁ గల్యాణ • రంగమునకు||

భళిరా ! ఈ సౌందర్యము జగన్మోహనమైనది.

ఉ|| మానవతీ లలామ, ధర • మానుగ నెవ్వనికిన్ లభించునో
వాసిద భాగ్య వైభవము • వానిద పుణ్య విశేషమంచు నా
మానసమందు నెంచెద స • మంచిత సుందర రూపమందు, నీ
మానినికిన్ సమానయగు • మానవతీమణి లేకయుండుటన్||అహ 3

సోమ—(రాజుల నందఱనుజూచి) నృపాలులారా ! అస్మత్తనూజయగు నీ జయప్రద మీలో నెవ్వనినో తనయిచ్చవచ్చినవారిని వరించును. అతఁడు నాకు జామాతయగుఁగాక ! తక్కిన నృపాలు రెల్లరు నీర్ష్య వహింపక శుభకార్యము చక్కగా నెఱవేరునట్లు జూచుడు. [శ్యామలతంజూచి] శ్యామలతా ! ఈ వచ్చియున్న రాజుల నందఱిని నీ వెఱింగి యున్నదానవు కావున, జయప్రదకు వేర్వేఱు, నెఱింగింపుము.

శ్యామ—చిత్తము. (జయప్రదనుజూచి) అమ్మా ! జయప్రదా ! ఈరాజుల సంగతిని నీకు వివరించి తెలిపెదను. ఇందు నీయిచ్చవచ్చినవాని గళంబునఁ బూలహారము వేయుము.

చ|| కురు మగధాంగ వంగ శక • కోసల కుంతల లాట సింధు ఘూ
ర్జర మలయాళ సింహళ వ • రాట ముఖాఖిల దేశ మానవే
శ్వరుల నెఱుంగఁ జేసెదను • భాసుర లీలను వేఱు వేఱ, నీ
వరసి వరింపు మొక్కనిఁ ద్వ • దాత్మకు నచ్చినవాని నచ్చెలీ||

[ ఇంచుక నడిపించి చేతితోఁ జూపుచు ]

తరళ॥ కులమునంబలు వన్నెకెక్కిన • కోమలాకృతి యుక్తుఁడుర్
కలితసంగర విక్రమూండు న • ఖండ పౌరుష శాలియుర్
బలువిధంబుల గీర్తిగైకొని • వన్నెకెక్కిన వాఁడు, కుం
తలము నేలెడు భూపచంద్రుని • దన్వి చూడుము వీనినిర్॥

జయ—(ఊరకుండును)

శ్యామ—(మఱియొకనిఁ జూపుచు)

చ॥ అవిరళ వైభవ స్ఫురణ • నా నరపాలుని ప్రక్కనున్న మా
నవపతి చంద్రశేఖరుఁ డ • నంత భుజా బలశాలి సింధుదే
శ వసుమతీశ్వరుం డఖిల • సజ్జన సంస్తుతి పాత్రుఁడాతఁడు, నీ
యవనిఁ బేరుగాంచె నబ • లా! కనుగొంటివె వేడ్కమీఱఁగన్

జయ—(మాట్లాడక యుండును)
శ్యామ—చెలీ! ఈప్రక్కకురమ్ము. వీరందఱికినిఁ జూడుము.
[ వేఱొకనిఁ జూపుచు ]

ఉ॥ పాళి ననేక బాంధవ చ • యంబు భజింప నపార వాహినీ
జాలముతోడవచ్చె నిను • సంతసమేర్పడ గైకొనంగ, భూ
పాలకు డంగదేశపతి • బాహుపరాక్రమశాలి యెన్నగా
బాలరో చూడు మాతనిని • భావమునందున నిచ్చయుండినన్॥

జయ—(ఊరకొనును)

శ్యా-చ॥ తను బలుపాజు కొల్వగ ము • దంబుననెయ్యెడ కేగుదెంచి ని
ల్చె; నిను వివాహమాడగను • శ్రీకరలీలను జూచినావె యా

తనని విదర్భదేశపతి • దారుణ సంగరమందు నీతనిన్
వనజముఖీ లలామ ! గెలు • వన్ బలువైరికినైన శక్యమే!

జయ.—(ఊరకొనును)

శ్యా-చ॥ అలఘుశరాసనాస్త్రయుతు • లై యచటన్ గనుపట్టువారలో
య్యలి మగధ మాళవాది నృపు • లందఱువీరులె, వారిసందఱన్
గలయ గణించి చెప్ప సమ • కట్టిన నేడులు వట్టుగాన, నీ
తలఁపున నుండెనేని యొక • ధారుణినాయకునిన్ వరింపుమా॥

జయ.—(ఊరకుండును)
శ్యామ.—(పురూరవునిఁ జూపుచు)

మ॥ పరివారంబు లనేకముల్ గొలువగా • భాసిల్లు నమ్మేది నీ
శ్వరు శోభామ! పురూరవుం డు, నిఖిల • క్ష్మాధీశ సంస్తుత్య సుం
దర పాదాబ్జుఁడు ధర్మసంధుఁడు జగ • త్ప్రఖ్యాత సంశీలుఁడీ
నరనాథాగ్రణి భూరిశౌర్య మహిమల్ • వర్ణింప రా దేరికిన్॥

జయ.—(పురూరవుని కంఠమునఁ బూలహారము వేయుచున్నది)

[ సభయందు సంతోషముతో కలకలము ]

సోమ.—రాజచంద్రులారా! మదీయ తనూజయగు జయప్రద చక్రవర్తి
యగు పురూరవుని వరించినది. కావున వీరికిజరుగు కల్యాణ మహో
త్సవము మీరువీక్షించి నన్నుఁ గృతార్థుని జేయుదురుగాక యని
కోరుచున్నాను.

రాజులందఱు.—సంతోషము- సంతోషము.

[ తెరవాలును ]

రంగము:— (మందిరమున- సోమదత్తుడు, పంకజవల్లి, జయప్రద పురూరవుడు ప్రవేశింతురు) అను॥ (4)

సోమ.—(పురూరవునిఁ జూచి) పురూరవభూపా!

ఉ॥ మామక భాగదేయ గరి • మంబున నీ సుత జన్మమందె, నీ
తామరసాయతేక్షణ క • తంబున దావక బాంధవాను బం
ధామిత వైభవంబు వెన • నబ్బెఁ గృతార్థుఁడనైతి నింక నీ
శ్యామను గూర్మి నేలుకొను • మయ్య ధరాధిపవంశ భూషణా!

(జయప్రదనుజూచి) తల్లీ! జయప్రదా! భవదీయ పూర్వపుణ్య విశేషంబున నీవు పురూరవ చక్రవర్తికి నీకు బతియయ్యె. విద్యావతివగు నీకు దెలియని విషయములు లేవు. అయినను వాత్సల్యమున జెప్పుచుంటిని. అత్తింటికి బోవు సమయమున నాడ బడుచులకు దల్లిదండ్రులు బుద్ధుల గఱపి పంపుట యాచారమై యున్నది. కావున నేఁజెప్పు వాక్యములు నీవు మఱచిపోవలదు.

సీ॥ భయ భక్తులనుబూని • పరమానురాగివై
చెలువుని కన్నుస • న్నల మెలంగి
యత్త మామల యెడ • బత్తి పెంపొందఁగా
వారలను గడు సే • వలను దనిపి
యాప్త బంధు జనాళి • నాదరంబునఁ గాంచి
మృదు భాషణముల స • మ్మోద మొసంగి
గర్వ మింతయు లేక • కరుణతో నతిథుల
నిష్ట మృష్టాన్న సం • తృప్తిఁ దేల్చి

గీ॥ కరుణవీడక సత్యంబు • మరువకుండ
నిట్టి సాధ్వి లోకంబున • నెంసు లేద

టంచుఁ బ్రజలెల్ల వినుతించు • నట్టి భంగి
నుభయకులపవిత్రవగుచు • నొప్పు మమ్మ॥

మ॥ అనిశంబుం గరమర్ణక్రియాచరణ కా • ర్యాయత్తచిత్తాబ్జవై
యనువర్తించి జగంబులందున మహా • ఖ్యాతిం బ్రకాశించి రా
యనఘస్వాంతలు భూరికాంత లనసూ • యా రుంధతీ కాంతలం
గన నీవట్లు యశంబు జేకొనఁ దగుం • గా భర్తృ సేవారతిన్॥

శంక — అమ్మా!

ఉ॥ ఆర్యులటన్న సువ్రతము • లన్నను దేవతలన్న శాశ్వతై
శ్వర్యములన్న నిర్మల య • శంబు లటన్నను బంధులన్న స
త్కార్యములన్న భాగ్య నుకృ • తంబు లటన్నఁ గుమారి నీకు రా
డ్వర్యుడెయంచు నెంచుచు న • హర్నిశముల్ జరియింపుమమ్మ నో॥

సోమ-చ॥ సతివయి జన్మగోత్రము య • శంబలరింపుము మావధూటికై
స్థితి నిజ వల్లభాలయము • చెన్నువహింప నొనర్పు మక్కలా
వతివయి ప్రాణనాథు వర • భావ కుతూహల మాచరింపు మీ
గతి విలసిల్లినన్ వినుము • ఖ్యాతివహింతువు లోకమందునన్॥

జయ — తండ్రీ! నీవాక్యములు నా హృదయ ఫలకమున లిఖించుకొని యుందును.

సోమ — (పురోహితునిఁ జూచి)

సీ॥ జనన మందిన దాది • జననిని నెన్నడు
విడనాడి యెఱుగని • విద్రుమోష్ఠి
పురమున నే శాసి • యరిగి నప్పుడు నాదు
రాక నిరీక్షించు • రాజవదన

మొండ కన్నన నేము • మొన్న డెఱుంగక
సౌఖ్యంబు లందెనే • జలజ నయన
కోపంబు నెక్కింత • చూపినఁ గన్నుల
న్నశ్రువుల్ నించెడి • యతివ మిన్న

గీ॥ మా మక తనూజ యీ సతి • మాన్య చరిత
భార్య యయ్యెను నీకు వ • భంగి దీని
సరసి రక్షింతువో కృపా • కరుడ వగుచు
భార మంతయు నీయదే • పార్థివేంద్ర॥

ఉ॥ ఆకలిగొన్న దా వసుగ • దన్నము కుత్తుక మొండి యుండినన్
గైకొనబోదు దాహమును • గన్గొని పెద్దలె యివ్వగా వలెన్
మాకును జెప్ప దేమియును • మాన్యచరిత్ర ! సుశీల ! నీమె నీ
వేకరణిన్ గృపంగనెదొ • యింపు దలిర్పగ భూ పురంధరా॥

పురూ——సోమదత్త నృపాలా ! నీతనూజంగూర్చి మీ రేమియు విచారింపఁబనిలేదు- ఈమె కావంతయుఁ గొఱంతయుండదు.

[ తెరలో- దేవా ! రథము సిద్ధముజేసినాను ]

పురూ——రాజేంద్రా ! ఇక మా కనుజ్ఞనిమ్ము- పోయివచ్చెదము.

జయ——తండ్రీ ! పోయివచ్చెదను.(కన్నీరువిడుచుచు)అమ్మా ! అను॥ (పో)

పంక——తల్లీ ! చింతింపకుము.

సోమ——కుమారీమణీ ! త్రిభువన సందనీయ గుణాధాముఁడును, లోకైక వీరుడును నగు పురూరవుఁడు నీకు భర్తయైనాడు- నీభాగ్యమువర్ణింపఁ దరముకాదు- అప్పుడప్పుడు నీ కుశలవార్తలు దెప్పించుకొందుము- నీకిచ్చుటకుండి కావలసిన యమూల్యవస్తుసంచయములఁ బంపుచుందుము- నీపతి యనుజ్ఞవడసి తోడ్కొని వచ్చు చుందుము నీవు విచారముడుగుము-

పురూ——నృపాలా ! ఇంక మేము రథారోహణ మొనర్తుము-

[ అందఱును నిష్క్రమింతురు ]

ఇది ప్రథమాంకము



# పురూరవ

## ద్వితీయాంకము.

---

రంగము:— ప్రతిష్ఠానపురము- అంతః పురోద్యానవనము.

[ ప్రవేశము- జయప్రద- పురూరవుడు ]

పురూ— సతీమణీ! ఈ వసంతకాలమెంతయు సౌఖ్య దాయకముగ నుండునుకదా. అటుజూడుము అను (6)

ఉ॥ భూరిపికౌఘ కైతవ చ • మూపతితోఁ దనుజూడ మారుడే
తేరగ దచ్చమూతతికి • దృప్తిపడన్ గిసలేచ్చ లేప్సితా
హారము బెట్టి చైత్రుడు సు • మాస్త్రీన కస్త్రచయంబుఁ జెల్మి పెం
పార నుపాయనంబొసఁగి • నల్లలరుల్ సెలువారె మ్రాకులన్।

జయ— ప్రాణేశ్వరా! అటుచూడుడు

చ॥ సరస వసంతదక్షిణుని • సంగతిమై నురుకోరక స్తనం
త రుచిరభృంగ నీలి మల • తాంత రజస్తమ పాండిమంబు పు
ష్పరసపు ఘర్మబిందువులు • భాసిల గర్భములూని గాంచె భా
స్వరముగ బూవు పిందెలను • సంతతమున్ లతికా సతుల్॥

పురూ— చెలీ! ఇటురమ్మా- (వృక్షములఁజూపుచు)

మ॥ స్వనితాంతాహతి కోపజాలక తరు • చ్ఛాయావదేశంబుచే
తనరణ్యావళి దాగినట్టి బహుళ • ధ్వాంతంబులన్ రూపు మా
ప ననేకాకృతులన్ ధరించి యినుడ • వ్వన్యన్ ప్రవేశించెనో
యన శోణద్యుతిమై ఫలావళులు నిం • డారెన్ మహీజంబులన్।

జయ—మనోహరా! ఆ కాసారతీరమున నెక్కింతకాల మాసీనులమై మందమారుత సౌఖ్యంబును గాంతుముగాక!

పురూ—తరుణీ! రమ్ము- (కాసార తీరమున కేగి కూర్చుండుదురు)

జయ—నాథా! రాత్రివచ్చిన కలంగూర్చి చెప్పెదనంటివి గాని, మరల నేదో సందర్భమున దానిని మఱచిపోయితివి. శ్రమకు క్షమించి, తెలుపఁగోరెద!

పురూ—ప్రియసీ! ఆసంగతి నాకు మరల జ్ఞప్తికివచ్చినంతనే సంతాపము గలుగుచున్నది

జయ—అయ్యో! అకల యంతసంతాపకరమైనదా?

పురూ—నిశ్చయముగా సంతాపకరమైనదే.

మ॥ గరితా యేమని చెప్పువాఁడను రిపు • ర్జ్యోత్కాంతు లేతెంచి, సం
గర రంగంబున గెల్చి రాజ్యరమ వే • గైకోఁగ నే నప్పు దు
ర్భర శోకంబున నీవు వెంటఁ జనుదే • రఁగ బిడ్డలంగూడి, భీ
కర ఘోరాటవిఁ జొచ్చినట్లు లకటా • కన్పట్టె స్వప్నంబునన్॥

జయ—అమంగళము శమించుగాక!

పురూ—ఆ కల గనినప్పటి నుండియు, నాచిత్తము వ్యాకులమయినది. నా సంతాపమునకు మేర లేకయున్నది-

జయ—నాథా! కలలోగన్న సంగతినిగూర్చి ధీరపురుషుఁడ వగు నీవిట్లు సంతాపమునందదగునా?

పురూ—రమణీ! ఏమి కారణముచేతనోగాని నాచిత్తమున బెంగ కలిగినది- నా కేదియో యొక గొప్ప కీడుమూఁడునని తోచు చున్నది- పరమేశ్వరుఁ డేమి చేయనున్నాఁడో తెలియకున్నది-

జ- ఉ॥ వైరుల నెల్లరం గెలిచి • వార్ధిపరీత ధరాతలంబు, నిం
పారఁగ నేలుచుం బ్రజల • నాత్మ తనూజులరీతిఁ బ్రోచుచుం
బేరు వహించినావు పృథి • వీపతు లెల్లరు మోదమంద, బూ
దార కులప్రదీప! సతు • దార గుణాకర! మన్మనోహరా!

నిరంతరము నీవు దైవమునే నమ్మియుంటివి. అట్టిచో నీకునాపద వాటిల్లుట యెట్లు? చిత్తమునఁ గలఁతఁ జేర్పక ధైర్య మనస్కుఁడవై యుండుము.

పురూ — నే నందులకు విచారింపనుగాని, నేను రాజ్యభ్రష్టుఁడనైతినేని నీవెచ్చటనుందువో యను చింతమాత్రము నన్నుఁ బీడించుచున్నది.

జయ — నాథా! నీకీవెఱ్ఱియేమి?

పురూ — ఒకవేళ నట్టిదినం భవించిన నీవేమిచేయుదువు?

జ-మ॥ జనపాలోత్తమ యిట్లు బల్కనగునే • సత్యమ్ముగా నీకు దు
ర్దినముల్ రా వొకవేళ వచ్చినను ధా • త్రిన్ నిన్నునుంబాసి, నే
మనఁగానోపుదునే! త్వదీయముఖ బిం • బంబున్ విలోకించుచున్
వనులందుండెదగాని చంచలవు సౌ • భాగ్యంబు నాకేటికిన్॥

నాథా! నీవెట కరిగిన నేనును నట కరుదెంచెదను. నాకు నీతోడిదేలోకము

పు-మ॥ సరసీజేక్షణ నీకు నాక్య మొసఁగన్ • సంతోషముంగూర్చి, నా
ధరణీరాజ్యము బోయినన్ వినుము సం • తాపంబునుంబొంద నీ
వర పూర్ణేందుముఖంబు జూచుకొనుచున్ • వంతల్ దిగందాఁపి దు
ష్కర ఘోరాటవినైన నుండగల ని • క్కంబిద్ది వాక్రుచ్చితిన్॥

సేవ — (ప్రవేశించి) మహారాజా! తొందరపడవలయును.

పురూ — సేవకా! అంతతొందర యేమివచ్చినది?

సేవ — ఇంతకుమున్ను మీచేత సంగరమున నోడిపోయిన కేరళ, మాళవ, పాంచాలాది భూపాలకు లెల్లరును నేడు మనపట్టణముపైకి దండెత్తి వచ్చినారు.

పురూ — ఏమీ! గర్వాంధకార ప్రమత్తహృదయులై వారు నా రాష్ట్రముమీదకే దండెత్తివచ్చిరిగా అను॥ (7)

శా॥ ఏమేమీ! భయమింతలేక మదిలో • నింతైన, నాపైకి నా
భూమీశాధములే రణంబునకునై • పొల్పార నేతెంచిరే
సామర్థ్యంబును జూపెదర్ రిపులకున్ • సంగ్రామ రంగంబునన్
భీమోద్య త్ప్రళయాగ్ని మీద శలభం • బై దూక నుంకించెఁగా॥

(సేవకునిఁజూచి) రణంబునకు బలంబుల సిద్ధము చేయుమని మంత్రికిఁదెలుపుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

జయ—నాథా! ఈసమయమున నిదేమి!

పురూ—తరుణీ! మనమేమిచేయఁగలము. ఇంతకుముందీ రాజులందఱును నాచేఁ బరాజితులైరి. నాటినుండియు వారు నన్నెట్లయినఁ బరాభవించుటకు వేచియుండిరి. ఒక్క రొక్కరుగ వచ్చినచో నన్ను గెల్చుటకష్టమని, అందఱును నేకమై దండెత్తివచ్చిరి. కానిమ్ము. వీరికి దగిన ప్రాయశ్చిత్తము జేసెదను.

జయ—నాథా! నాకేందుచేతనోగాని, చిత్తము పరితాపమయమైనది. ఈసమయమున మనకేమిహాని వాటిల్లునో తోచకయున్నది. ఇందుకు మార్గమేమి యూహింతము. మన కపాయమొనగూడని తెరువు నూహింపవలయును.

పు-మ॥ అతివా! నీవిటు చింతజెందఁగను నే • లా భీతిచే, సంగర
క్షితిలో శత్రులనెల్ల గూల్చుచు జయ • శ్రీగాంచెదర్ వీక, నా
యత బాహాబలశౌర్యమేర్పడఁగ ధై • ర్యంబొప్పి శత్రుత్రమా
పతులెల్లర్ దలలెత్తకుండఁగ టులర్ • బల్మాట లింకేటికిన్॥

జయ—నాథా! నీశౌర్యధైర్యములు నే నెఱింగియుంటిని. కాని శత్రువులందఱును నేకమై యొకసారిగ నీపైకిదండెత్తివచ్చుటంజేసి నా మనంబున నొక్కింత సంశయముగలుగుచున్నది. కావున నావాక్యము

ములు మన్నించి సాధ్యమగునంతవఱకు సామముమీద కార్యము జరుగునట్లు చూడఁగోరెదను.

పురూ—నీవు నన్నుగూర్చి సంశయింపఁ బనిలేదు. త్రిలోకంబు లొక్కపెట్టున నెత్తివచ్చినను వెనుదీయను.

గీ॥ రణముఖంబున రిపుల ద • ర్పంబు నార్చి
నీకు మోదంబు గూర్చెద • నిక్కముగను
సంశయింపఁగనేల నీ • స్వాంత మందు
మత్పరాక్రమం బెఱుఁగవా • మగువ మిన్న॥

రమ్ము. నేను సమరప్రయత్నమున నుండవలయును.

[ నిష్క్రమింతురు ]

రంగము:—[ అంతఃపురమున జయప్రద ప్రవేశము ]

జయ—(తనలో) అక్కటా! నే నెంత చెప్పినను వినక ప్రాణేశ్వరుఁడు యుద్ధమున కరిగినాఁడు. వైరిబలంబు హెచ్చుగ నున్నదని వింటిని. మాకెట్టికీడు సంభవించునో యేమియుఁ దోచకయున్నది. పరమేశ్వరుఁ డేమిసేయనుండెనో! నా యెడమకన్నదరుచున్నది. ఏమి యశుభవార్త వినవచ్చునో కదా!

[ శ్యామలత ప్రవేశించును ]

శ్యామ—(జయప్రదనుచూచి) దేవీ! మనకెట్టిదుస్థితి సంభవించినది.

జయ—శ్యామలతా! భుజబల శౌర్యమున విజృంభించి రణరంగంబున వీరవిక్రమ విహారము సలుపుచున్న మన్నాథునకుఁ గుశలమే కదా!

శ్యామ—అమ్మా! మహారాజునకు సేమమే గాని, విజయలక్ష్మి శత్రురాజులనే వరించినదని వినియుంటిని.

జయ—అక్కటా! రిపులే గెల్చిరిగా! ఈ సంగతి నీ కెవ్వరు చెప్పిరి?

శ్యామ—శత్రురాజు లెత్తిన విజయపతాకమే తెలుపుచున్నది.

జయ — ఇంకను యుద్ధము జరుగుచున్నదా ?
శ్యామ — ఇంక యుద్ధముతో నేమిపనియున్నది?
జయ — నీవరిగి మహారాజుగారియుద్యమమేమో నమ్మదిగా నెఱింగిరమ్ము.
శ్యామ — మంచిది- (నిష్క్రమించును)
జయ — (తనలో) అక్కటా ! శత్రువులు నా నాథునింగెలిచి విజయ పతాకమెత్తినారట. ఇంకముందు వారు మాయెడల నేమిహానిసేయ దలంచి యుండిరోకదా-

[ పురూరవుఁడు ప్రవేశించును ]

పురూ — (తనలో) ఆహా ! ఇదియంతయుం గలిమాయ కాకున్నచో దేవేంద్రాదులనైనను యుద్ధమునఁ గణింపని నేను సంగరంబున సామాన్య నృపాలురను గెల్వలేకపోవుట యేమి ? పోనిమ్ము, రణమున జయాపజయములు దైవాధీనములని తలంచి యూరకొందమన్న, శత్రువులు నా రాజ్యమంతయు, దమవశముఁ జేసికొని నన్నుఁ బురినుండి వెడలిపొమ్మని చెప్పుటయేమి ? ఇంతలకు నే నేమని చింతింతును.

చ॥ సమరమునందు శాత్రవులు • సాహసమేర్పడ నన్నుఁ గెల్చి; రా
జ్యముఁ గొని, ముందువెన్కలను • నారయకుండగ నిల్లు జేసి రం
చు మగువ కెట్లు జెప్పుదును • శోకమునందదె యుండిపిన్న; హా
కమల భవాజ్ఞ దాటఁగ జ • గంబున నెవ్వఁడు శక్తుఁడయ్యెడన్ !

(ఎదుటఁజూచి) ఇదిగో ! కాంతామణి ! నా యపజయంబును గూర్చి యీమె వినియుండినట్లే తోచుచున్నది. (సమీపించును)
జయ — (లేచి ప్రాణనాథునిఁగాంచి) నాథా ! సంగరంబున నేవిధమైన యాపదయుఁ బొందకుండవచ్చి నాకంటఁబడితివా ? నాపరితాపము దీరినది.
పురూ — రమణీ ! సంగరంబున నీల్గియుంటినేని నాకీ పరితాపమేయుండదు. క్షత్రియునకు, రణముఖమున నోడుటకంటె జచ్చుటయే మేలగునుగదా

జయ—నాథా! జయాపజయంబులు దైవాధీనములు. దానిసింగూర్చి వగవంబని లేదు.

పురూ—సతీ! అపజయముకన్నను నెక్కువసంతాపకరమైన వార్త నీకు వినిపింపవలసి వచ్చినది.

జయ—ప్రాణేశ్వరా! నీవు సుఖముగనున్న నంతియే చాలును-నాకెట్టి సంకటములు గలిగినను నేను లక్ష్యముచేయను- (ఇంచుకయూరకుండి) అయినను నదియెట్టిదో కరుణించి తెలిపెదవా?

పురూ—(విచారముతో) అను (8)

ఉ॥ ఓ వనితా శిరోమణి! మ • హోత్పలపత్ర విశాలనేత్రి, నే
నేవిధి నీకుఁ జెప్పుదును • నెట్లు భరింతును చింత, శాత్రవ
తస్కరభూభుజుల్ నను జ్ఞ గెలిచి • సంపదనెల్ల గ్రహించి, రాజ్యమున్
వే విడనాడి పొమ్మనిరి • భీకర కాననభూమిఁ జేరఁగన్ ॥

జయ—హా! ఎంతకష్టము. ఎంతకష్టము.

మ॥ అకటా! ఏమని ధాత దూరుదును, నా • హా సర్వభూమండలిన్
బ్రకట ప్రాభవ లీలనేలుచు జగ • త్ప్రఖ్యాతిఁ గైకొన్న నీ
విక నేరీతిని రాజ్యహీనుఁడవునై • హీనస్థితిన్ జింత, నొం
దక ఘోరాటవులన్ జరింపఁగలవో • ధాత్రీ విభుగ్రామణీ ॥

అక్కటా! మనోహరా! నీకు సంభవించిన యవస్థకు నేనేమని చింతింతును.

తే॥ సకల సామంత రాజన్య • సంఘము వెలిమి
భక్తిసేవింప నలరారు • పార్థివుండ
నకట! యేరీతి నా యర • ణ్యంబులందు
వాస మొనరింప నోర్తువో • ప్రాణనాథ ॥

మనకెట్టి దుర్గతి సంభవించునని కలనైనఁ దలంపలేదు.

పురూ—రమణీ! ఇదియంతయు విధిప్రేరణ. ఇప్పుడు మనము చింతిం

చినందువలనఁ బ్రయోజనము లేదు- తెల్లవారక పూర్వమే నే నీపు రంబును విడువలయునని శత్రురాజుల యాజ్ఞయై యున్నది- కావున,

సీ॥ అతివరో నీవింక • నాత్మలోపల జింత
నావంతి జేర్పక • శ్యామలతయు
బుత్రుఁడు, రా, నీదు • పుట్టి నింటికి బొమ్ము
నే వని కేగెద • నిశ్చయముగ
విధి విధించినరీతి • విపినంబులందు శ్రే
మంబులకోర్చి కా • లంబుగడిపి
మంచి దినములు సం • ప్రాప్తమైనంత నే
యేతెంచి నిన్ను వీ • క్షించువాడ
తే॥ గీ॥ కష్టసుఖములు జీవికి • గలుగుచుంట
సహజమంచును భావించి • స్వాంతమందు
ధైర్యమునుఁబూని కాలంబు • ధర్మమరసి
నీవుగూపను గడపుమీ • నెలతమిన్న ! అను (9)

జయ——నాథా ! ఎంతమాట జెప్పితివి - సకలసంపదలను విడిచి నీవరణ్యముల కేగుచుండఁగా నేను నిన్నువిడిచి నాపుట్టినింటికరిగి, సుఖముల ననుభవించుచు నుందునా ? అట్లెన్నఁడును దలంపవలదు-ఈశరీరము భవత్సేవకై సృష్టింపఁబడినది. నాథ నీపాదసేవ జేయని దినము దుర్దినము- నిన్నువిడిచి నే నొక నిముషమైన బ్రాణంబులు శరీరంబున నిలుపఁజాల- నీవెచ్చటకరిగిన నేనును నచ్చటికి వచ్చెద-

పురూ——అబలా! నిన్ను విడనాడి యుండవలయునని యుద్దేశము నాకును లేదు. కాని, యరణ్యంబులందు నీవు కష్టములు బడుచుండఁగా నేను జూచి సహింపఁజాలను- ఆగారణంబుచేత నీకట్లు వచించితిని.

జయ——మనోనాథా ! అరణ్యమైన నేమి ? పురంబైన నేమి ? నీతో నుండుటయే నాకుఁ గావలసినది- కావున నన్నుఁగూడఁగొనిపొమ్ము. నీవు పడనున్న కష్టములయం దర్ధభాగము నేఁగూడ బంచుకొనెద

పు—సీ॥ అతిభీతిఁ గొల్పు గ • హన భూములే గాని
యుద్యానవనములు • నుండవచట
జయ—అతిభీతిఁగొల్పు గ • హనభూములే నాకు
నుద్యాన వనులౌచు • నొప్పునచట
పురూ—బహుభయంకర మృగ • వర్గంబులే గాని
బరిచారికలు నీకు • వరల రచట
జయ— బహుభయంకరమృగ • వర్గంబులే నాకు
బరిచారికలుగాఁగ • వరలునచట
పురూ— శయనింపఁ గఠినపా • షాణవేదులే గాని
హంసతూలిక పాన్పు • లలరవచట
జయ— శయనింపఁ గఠినపా • షాణవేదులె నాకు
హంసతూలికపాన్పు • లగుచు నచట
పురూ— కడుపార భక్షింపఁ • గందమూలలె గాని
వివిధ భక్ష్యంబులు • వెలయునచట
జయ— కడుపార భక్షింపఁ • గందమూలలె నాకు
వివిధ భక్ష్యంబులై • వెలయునచట

పు—తే॥ గీ॥ వనిత నీవేడ కానన • వాసమేడ
వలదు పుట్టినింటికఁ జను • నిలుపు నిలుపు
జయ— ప్రాణనాయక నినుఁబాసి • బ్రతుకఁ జాల
యరుగుదెంచెద నిఁకఁ గూడి • యానతిమ్ము॥

మనోహరా! నన్నుఁగూర్చి నీవావంతయుఁ జింతింపవలదు-నీతో నుంటినేని దుర్భరారణ్యావాసము నాకుఁ బురవాసముగనే యుండును-కష్టములన్నియు సుఖములే యగును-

పురూ—హా! తరుణీ! నామూలమున నీవుకూడ కష్టములఁ బడుదువా?
మనసంగతి యటుండ,

తే॥ గీ॥ పలుకనేరరు కడుబసి • వారు, ముద్దు
గొమరులేరీతి నుందురా • ఘోర వనుల
నక్కటా మనయందు నా • యజుడు నిర్ద
య వహియించె, నీరీతినే • మందు నతివ

జయ-ప్రాణేశ్వరా ! నీవు చింతింప వలదు- చీకటి కొన్ని దినములు- వెన్నెల కొన్ని దినములు నుండునట్లే కష్టసుఖములుగూడ వచ్చుచుండును- కష్టము లెప్పుడును గాపురము సేయవు- ప్రాణేశ్వరా! నీధర్మ సంధతయే నిన్ను రక్షించుగాక! ఇంక విచారముడిగి వైరులు మనకడ కరుదెంచి మరల జెప్పక పూర్వమే మనము పురమువిడచి పోవుదము-

పురూ-విధికృతమునకేమి సేయుదుము- అన్నిటికిని నాభగవంతునేనమ్మియుందము- (భగవంతుని నుద్దేశించి) హే దేవా ! ఆర్తత్రాణ పరాయణా! అను (10)

శా॥ వాలాయంబుగ మమ్ము గతువనుచుర్ • భావంబుల న్నమ్మి నీ
పాలన్జేరితిమయ్య యిప్పుడు కృపా • పాథోనిధీ ధీనిధీ
పాలన్ముంచిన నీటముంచిన సరే • భారంబు నీదాట మా
కేలా వేళాకచింతఁ జెందగను దం • డ్రీ! భక్తరత్నామణీ ॥

(నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము-

—:0:—



# పురూరవ

## తృతీయాంకము.

రంగము:— [అరణ్యము:—
(పుత్రసమేతముగా పురూరవ జయప్రదలు ప్రవేశము-) అను(11)

పు। సీ। కడు భయంకరమైన • గహనంబులే నీకు
మందిర ప్రకరమా • మగువ మిన్న
గుండ లవియజేయు • ఘోర మృగంబులే
నీ చెలికత్తెలా • నీరజాక్షి
మెన్నడెఱుంగని • యాకంద దుంపలే
యిష్ట మృష్టాన్నమా • యిగురు బోడి
కంటకా వృతమైన • కఠిన నేలయో నీకు
విరిసెజ్జ యయ్యెనా • విద్రుమోష్ఠి
తే। గీ। కటకటా నాకతమున నా • గర్భభోగి
వైన నీవెట్టి కష్టంబు • లందవలసె
చింతనేరీతి భరియింతు? • గాంత! ధాత
వ్రాత కేమంచుమదిలోన • వగచువాడ!

అక్కటా! రాకాశశాంకుని ధిక్కరించు నీమోముగమెంతయు వాడి యున్నది నీయవస్థజూచి నేనెట్లోర్వఁగలను?

మ॥ చతురంభోధిపరీత భూమివలయా । క్రాంతోల్లసద్విశ్వ భూ
పతి సందోహము సన్నుతింపఁగ ధరన్ । బాలించుచున్ భూమి సం
చితకీర్తిన్ గొనినట్టి నాకు సతివై । జెన్నొందియున్ నేటి కీ
గతి బాముల్ బడుచుంటి వక్కట మహా । గ్రారణ్యవాటిన్ సతీ॥

నామూలమునఁగదా నీకీ కష్టము ప్రాప్తించినది.

తే॥గీ॥ ఎన్నఁడ కన్నన నేమియో । మొన్నడఁబుగ
నట్టి పుట్టుభోగివి, యరఁ । ణ్యంబులందు
నిట్లు కష్టముల్ బడుచుంటి । వేమనందు
చారుశారద పూర్ణిమా । చంద్రవదనా ।

(కుమారులంజూచి) అక్కటా! కుమారుల మొగము లెట్లు వాడియున్నవో నోరెఱుంగని యీ పసికూనలకు మనమూలమునఁగదా యిట్టి దుర్గతి సంభవించినది.
జయ—అయ్యో! పుత్రు లాకలిబాధచే గాబోలు నింతవఱకును నేడ్చి యేడ్చి సొమ్మసిలి పోయినారు.
పురూ—హా! వత్సా! (భార్యంజూచి)

తే॥ గీ॥ చతురజలధి వలయితమా । క్ష్మాతలంబు
బాలనము సేయువాని కు । మారు లయ్యు
కూడు దొరకక యీరీతి । కుందనాయె
నగవు నేరీతి నాపుదు । వారిజాక్షి ।

అక్కటా! వీరిం జూచిన నాకు దుఃఖమాగకయున్నది.

జయ—అయ్యో! ఆకలిచేఁ బుత్రు లేడ్వలేక యున్నారు హా! కుఱ్ఱ
లారా!

చ॥ కొడుకులు లేరు లేరనుచుఁ • గుందుచు సాక్కుచు సోలుచుండి యె
ప్పుడును ననేకదైవములఁ • బూజలసేయుచు నుండునట్టి య
ప్పడఁతుక లనేకులుండ, భగ • వంతుఁడు, నాకునొసంగనేల, యే
పడతికినైనఁ బుట్టిన, న • వస్థను బొందరుగా కుమారకుల్ ॥

(పురూరవునిఁజూచి) హా! నాధా! ఆకలిబాధ నన్ను దహించి వేయుచున్నది-

పురూ—ఇంతీ! ఇంచుక వడిగా నడచితివేని, మనమేదైన నొక గ్రామము జేరుకొనఁ గలము- అక్కటా! ఎంతగతివట్టినది-

జయ—అయ్యో! నేనొక యడుగైన నడువఁజాలక యున్నాను- (కూర్చుండును)

పురూ—ఎంతకష్ట మెంతకష్టము-

మ॥ వనవాసం బొనరింప లేవనుచు నేఁ • బల్మారు వాక్రుచ్చినన్
వినకే వచ్చితి వేమనందు నకటా! • నీకష్టముల్ జూచినన్
విను నా చిత్తము వ్రయ్యలయ్యె నిపుడో • బింబోష్ఠి, యేరీతినిన్
విను రక్షింపఁగ నోపువాఁడ నెరవుల్ • వీక్షింప లేకుంటిగా ॥

(చూచి) అక్కటా! ఈ సుందరి మాటలాడక సొమ్మసిల్లి యున్నది- ఇప్పుడు నేనేమి సేయుదును- హా! పరమేశ్వరా! మాకిట్టి సిలుగుల గల్పించుటకు నేను నీయెడల గావించిన యపరాధమేమికలదు- నిరంతరము నీచరణసేవతప్ప నన్యమెఱుంగని మాకిట్లు వంతలఁ గూర్ప నేల? దేవా! నాచిత్తము శోధించుటకిట్లు జేసితివని తలంచెదను- భగవంతా! నీవు నాచిత్తము శోధించ నవసరములేదు- నీవు నాకెట్టి సిలుగుల గల్పించినను నీ చరణారాధన నేను మానువాఁడనుగాను- ధర్మము దప్పను- (జయప్రదనుగాంచి)
సతీమణీ! సతీమణీ! (ఇంచుకయూరకుండి) ఈమెకు మాటలాడుటకైన శక్తిలేకున్నది- ఈప్రాంతమున నెచ్చటనైన నుదుకముండునేమో

ఉదకము దెచ్చుటకైన మూర్ఛమునింగిన యీభార్యా పుత్రులను విడిచి యెట్లు బోవుదును ? (జయప్రదనుఁజూచి) అక్కటా ! యీనారీ శిరోమణి వలదని యెంతిచెప్పినను వినక, నావెంటవచ్చి యిట్టి దురవస్థఁ బొందుచున్నది- ఈమె పుట్టినింటి కరిగియున్నచో నీకష్టములఁ బొంది యుండదుకదా ! కంటకశిలావృతమైన యరణ్యప్రదేశమున నడచుటం జేసి, పద్మపత్ర సన్నిభములగు నీమెచరణంబు లరుణకాంతివహించినవి. ఈమె శరీరము యెండయందువైచిన తామరాకుచందమున వాడి యున్నది. ఇట్టిస్థితియందున్న యీమెనుఁజూచి నేనెట్లోర్వఁగలను ?

( విచారించుచున్నాడు. )

[ఆనందుఁడు - ప్రవేశించును.]

ఆనం—[తనలో] అదిగో ! ప్రొద్దు గ్రుంకుచున్నది నేను త్వరగా నిల్లు చేరుకొనవలయును. [ఇంచుక నడచును.]

పురూ—హా ! పరమేశ్వరా !

ఆనం—[ఎదుటఁజూచి] పాపము- ఎవరో! ఈ యడవిం జిక్కుకొని విలపించుచున్నట్లు దోచుచున్నది. ఆపురుషునిఁజేరి పరితాప కారణం బారసెదగాక. [పురూరవుని సమీపించి] ఓ పుణ్యపురుషా! నీవెవ్వరవు? ఈయడవి కేలయేతెంచితివి? ఈనిద్రించుచున్న పసిపాపలును, నీమెయు యెవ్వరు?

పురూ—ఓయీ! ఏమని చెప్పుదును. నేను పురూరవచక్రవర్తి యాస్థానమున లెక్కలవ్రాయువాడను. పురాకృతప్రారబ్ధమున సమస్తభాగ్యమును గోలుపోయి, యిట్లరణ్యముల పాలయితిని. ఈమె నా భార్య, ఈపాపలు నాకుమారులు- ఆకలిబాధచే వీరిట్లు మూర్ఛిల్లిరి. [ఇంచుక యూరకుండి] నీవెవ్వరవో తెలుపఁగవచ్చునా?

ఆనం—అయ్యా! నాపేరు ఆనందుఁడందురు. ఇచ్చటకు సమీపమున నున్న సోమపురము మాకాపురము. [ఇంచుక యూరకుండి] ముందుగా వీరికి జలమిచ్చియైన మూర్ఛనుండి లేవదీయవలయును. నేను జలముగొనివచ్చెద. [నిష్క్రమించును.]

పురూ—[తనలో] ఈతఁ డెవరో పుణ్యాత్ముని వలె నున్నాఁడు.
ఆనం—[ప్రవేశించి] ఇదిగో! జలములు ముందువీరికిఁబోయుము.
పురూ—[జలముల గైకొని నెమ్మదిగా జయప్రదనోటిలోను, కుమారుల నోటిలోను బోయును.]
జయ—హా! ప్రాణేశ్వరా! [లేచును]
[కుమారులుగూడ లేత్తురు]
పురూ—ప్రాణేశ్వరీ! భయమందకుము.
జయ—[ఆనందుని నుద్దేశించి, పురూరవునితో] నాథా! ఈతఁడెవ్వరు?
పురూ—తరుణీ! ఈదయాశాలిమూలముననే నీవును గుమారులును బ్రతికితిరి.
ఆనం—[పురూరవునిఁజూచి] ఓ! మహాత్మా! నీవిచ్చటనుండి యెచ్చటి కరిగెదవు?
పురూ—ఏమని చెప్పగలను? ఏదైనఁ బురము జేరుకొని, జీవనోపాధి నారయవలయును. ఇంతకంటె నాకు వేరొకమార్గమేమున్నది?
ఆనం—అట్లయిన నీవు నామాటవిని మాగ్రామమునకు రమ్ము. నాచేతి క్రింద ననేకులు కూలివాండ్రున్నారు. మాకు లెక్కలను వ్రాయుచుండుము. నీకుఁ గూడ గుడ్డల కేవిధమైన కొఱఁతయు లేకుండఁ గడపెదము.
పురూ—[జయప్రదనుజూచి] ప్రాణేశ్వరీ! ఇప్పటికి మనమీ దయామయుని చేతిక్రిందఁ దలదాచుకొనుట మంచిదని తోఁచుచున్నది.
జయ—నాథా! ప్రస్తుత మీమార్గము బాగుగనున్నది.
పురూ—[ఆనందునిజూచి] ఆనందా! నీకరుణకు నేనెంతయు సంతసించితిని. పరమేశ్వరుఁ డీసహాయమున దిక్కులేని మాకు నినుఁజూపించినాఁడు.
ఆనం—రండు. గ్రామమున కేగుదము.
పురూ—[తనలో భగవంతుని నుద్దేశించి] హా! పరమేశ్వరా! నీచర్య లద్భుతములు.

తే। గీ। సకల సామంతరాజన్య • సంఘమెపుడు
భక్తిసేవింప దనరు భూ • పతిని నన్ను
కూడు గుడ్డలుగూడ లే • కుండఁజేసి
కొమరునిఁ గొల్వఁజేసితివిగా • యుర్వియందు।

[ఆనందమునిఁజూచి] కరుణామయా! రమ్ము- పోదము-
[అందఱు నిష్క్రమింతురు]

---

—*రంగము:—సోమపురము*—

[గృహమున నవకోటి నారాయణశెట్టి ప్రవేశము]

నారా—[తనలో] ఏం వీడట్టుకుందోగాని మాయపిడ- అప్పుతీసుకొని వెళ్ళినాళ్ళల్లా యెగయ్యేడం మొదలెట్టినారు- ఇందుచేత నాసొమ్ము తగ్గుతూంది- దీనికేదయినా గట్టిగా ప్రయత్నించవలెను. లేకపోతే మాటదక్కదు- వున్న కాస్తడబ్బు అయిపోయినదంటే తరువాత యెవడుచూస్తాడు-

[రామశాస్త్రీ ప్రవేశించును]

రామ—[సెట్టినిఁజూచి] ఇదిగో! సెట్టిగారు తీరుబడిగఁ గూర్చున్నారు?
నారా—ఓహో! చాస్త్రుళ్ళుగారా! ఇల్లాకూసోండి.
రామ—[కూర్చొని పంచాంగముదీసి] ఈవాళ శనివారం- నవమి వెళ్ళ ద్వాదశి- అనూరాధానక్షత్రం- పదకొండు ఘడియలతో వర్జము వెళ్లిపోతుంది.
నారా—నరేగాని చాస్తుల్లుగారూ! మిమ్మల్ని వొకసంగతి అడుగాలి. మీరునకీగా ఛాస్త్రంసూచి సెప్పండి.
రామ—సెట్టిగారి కభ్యంతరమేమున్నది?

నారా—సూడండి! ఈమధ్యనుండి మానయింటికర్చు యెక్కువై పోయింది రాబడి తక్కువైంది. కాబట్టి ధనం తఱుగకుండా వుండేమార్గం బాగానూసి సెప్పండి.
రామ—సెట్టిగారి జన్మనక్షత్రం జ్ఞాపకమున్నదా?
నారా—"చతభిస"అని గ్న్యాపకం
రామ—సరే. (పంచాంగముఁజూచి (వేళ్ళులెక్కబెట్టి) సెట్టిగారూ! ఇందులో ఒక్కచిన్న తిరుగుయున్నది. ఈవిషయములో ముందు మీారు కొంతసొమ్ము ఖర్చుపెట్టవలెను. అట్లుఁ జేసినఁగాని మీాకు ధనము శాశ్వతముగా నిలువదు.
నారా—దాని కభ్యంతర మేముంది. ఆమార్గ మేమిటో చెప్పండి.
రామ—ఈగ్రామములో మీారు జనోపయోగార్థమై గొప్పతటాక మొండు త్రవ్వింపుడు. దానివలన మీాకుఁ గీర్తియుఁ బుణ్యమును గలుగుటయేగాక మీాసంపద స్థిరమైయుండును.
నారా—మీారు బాగా సూసిసెప్పిందేకదా
రామ—అందులో నేమీా సందేహములేదు. తటాక నిర్మాణానంతర మున బదివేల బ్రాహ్మణులకు సంతర్పణ చేయవలయును.
నారా—అంతసెరువు తవ్వించినప్పు డదిసేయ్య నయ్యా మరి
రామ—నాకు ప్రొద్దెక్కుచున్నది నేనింకను బోవలసిన గృహములు చాలాయున్నవి. [నిష్క్రమించును]
నారా—[తనలో] ఈచాస్త్రుల్లు సెప్పింది బాగుంది. [పక్కచూచి] యెవడురా! అక్కడ
సేవ—[ప్రవేశించి] ఏమి! సెలవు
రానా—నీవు పోయి త్వరగా ఆనందుని తీసుకొనిరా.
సేవ—చిత్తము. [నిష్క్రమించును]
నారా—ఊరుమధ్యనున్న నాతాలూకు ఖాళీస్థల మందయు చెఱువు తవ్విస్తాను. ఆనందునితో యీాసంగతిసెప్పి తగిన యేర్పాటు సేయిస్తాను.

[ఆనందుఁడు ప్రవేశించును-]

ఆనం—[సెట్టినిఁజూచి] సెట్టిగారెందుకో నన్నుఁ బిలిపించినారే!

నారా—ఆనందా! వచ్చావూ! ఏపనివచ్చినా నువ్వుంటేగాని సాగదు- గ్రామమధ్యమందున్న భూమియంతయు ప్రజ కుపయోగించడానికి చెఱువు త్రవ్వించతలచినాను-

ఆనం—తమరట్టి సత్కార్యమును చేయించవలసినదే-

నారా—అందుకని నీవు నీసేతికిందనున్న కూలీలతో సిద్ధముగావుండి యాపని త్వరగా పూర్తిచెయ్యాలి-

ఆనం—తమరు సెలవిచ్చినదే తడవుగ పని ప్రారంభింతము- కాని మీతో నొకసంగతిమాత్రము చెప్పుకొనవలసియున్నది- మాకూలీలందఱకును లెక్కలువ్రాయు కరణీకుఁ డొకఁడున్నవాఁడు- వానికిఁగూడ మాతోఁబాటు కూలి నొసంగవలయును-

నారా—అట్లే మామూలు యెట్లాగో, అట్లాగే- దాని కభ్యంతరమే వుంది-

ఆనం—పని యెప్పుడు ప్రారంభించుటకు సెలవు?

నారా—నీవు రేపు పొద్దెక్కకుండా రా- శాస్త్రిగారితో చెప్పి మంచి రోజు చెప్తాను-

ఆనం—చిత్తము- (నిష్క్రమించును)

(లోపల) తానానికి లెగండి

నారా—వంటయినదికాబోలు- (నిష్క్రమించును)

---

-• రంగము:-నవకోటి నారాయణుని గృహము •-

[ ప్రవేశము:- నారాయణసెట్టి ]

నారా--ఆకరణీకునిభార్య చాలానక్కనైనదట- అల్లాటి అందకత్తె అతఁడికి యెల్లా భార్యా యైందోకదా! ఆసంగతి వినేటప్పటికే

నారాళ్ళు గరిషాడిసింది- అందుకనే యీవాళ భత్యాలు తీసుకో
డానికి కూలీవాళ్ళ ఆడోళ్ళను పంపవలసిందని చెప్పినాను-అందఱూ
వచ్చి కూలి తీసుకొనివెళ్ళినారట- కరణీకునిభార్య యింకా రాలే
దోవ్వా సెప్పా! [ఎదుటఁజూచి] ఎవదురా! అక్కడ?

సేవ—[ప్రవేశించి] అయ్యా! ఏమిసెలవు?

నారా—ఈవాళకూలి ఆడోళ్ళను పట్టుకొనివెళ్ళమన్న సంగతి కరణీకుడి
భార్యకు గూడా తెలిసిందా?

సేవ—తెలిసినది- అదిగో! ఆమెవచ్చుచున్నట్లున్నది-

నారా—వస్తావుందీ! అట్లాగయితే నేనావక్క కెళ్తాగాని, యిందాకా
నేను సెప్పినానే అలాసెయ్యి- (మూలను దాగును)

(జయప్రద- ప్రవేశించును)

జయ—(తనలో) హా! పరమేశ్వరా! మమ్మెట్టి దుర్గతికీడ్చితివి!

మ॥ వరసౌధంబునఁజేటికాజనము శుం • భద్భక్తి సేవింపఁగా
చిరసౌఖ్యంబున నెప్పుడుం దనరు రా • జీవాక్షి నా నన్ను నీ
కరణిన్ జేసితి వేమనందు నహహా • కారుణ్యమున్ బూనకే
నిరతంబున్ నినునమ్ము మమ్మునిటులన్ • జేయంగన్యాయంబొకో

రాజాధిరాజులు సేవింప, వైభవంబున నలరారు నాప్రాణేశ్వరుని సామాన్యకూలివాండ్రకు లెక్కలుఁవ్రాయునట్లుఁ జేసితివికదా! అట్టి మహారాజునకు భార్యనైన నేను కూలిదానివలె భత్యము తెచ్చుకొనుటకొక వైశ్యునియింటికిఁ బోవలసివచ్చెనుగదా! [ఇంచుకయూరకుండి] ధాతవ్రాతను నెవ్వరుదాటఁగలరు? ఎప్పుడును ధర్మముదప్పని మమ్ము భగవంతుడే రక్షించుఁగాక! ఇంక నేనాలసింప నేల! పతియాజ్ఞ ననుసరించి వచ్చిన నేనీవైశ్యు డీయవలసిన కూలిం గైకొనిపోయెదఁగాక! ఇదిగో! వైశ్యునిగృహము. [పరికించి] కూలివాండ్రభార్యలందరును తమ తమ భత్యములఁగైకొని యిండ్లకేగినట్లు దోచుచున్నది. అంద

తితోఁగలసిరావలసినది. అయినను మించిపోయినదేమి! నిర్మలచిత్త
నగు నాకేమి భయము! [గృహద్వారమును సమీపించి] ఇదిగో!
ఇక్కడ నొకసేవకుడున్నాఁడు. వీనినడిగి తెలిసికొందుగాక! [సేవకుని
జూచి] ఓయీ! సెట్టిగారితాలూకు చెఱువుత్రవ్విన కూలివాండ్ర
తాలూకు భత్యములను వారిభార్యలువచ్చి తీసికొనిపోయిరా?

సేవ—ఇంతకుముందేవచ్చి తీసికొనిపోయిరి. నీకు రావలసిన భత్యపు
గింజలు నాయూలఁబెట్టినారు. పోయి తీసికొనుము.

జయ—మంచిది. [ఇంచుక నడచును]

సేవ—[ముందుగదితలుపు నావలభాగమున వేసి నిష్క్రమించును]

జయ—[ఇటునటుఁజూచి] ఇందెచ్చటను మాకీయవలసిన భత్యపు
గింజలు కానిపించవే. సేవకుఁ డిచ్చటనుండునని చెప్పెను. [ఇంచుక
యూరకుండి] ఏమిది! నాశరీర మదిరెుకవిధమున గంపమొందు
చున్నది. పోనిమ్ము నేనతిగి, నాథునితో నందఱును భత్యములు
గైకొని యరిగిరనియు, నేను పోవునప్పటి కెవ్వరును లేరనియు
జెప్పెద. [పోనెంచును]

[నారాయణసెట్టి ప్రవేశించును]

నారా—[తనలో జయప్రదను] నాకర్లుసెప్పినదానికంటె యెుయ్యా
రొల్లు అందకలది. అబ్బా! యేమియుగ్రహం. సక్కనిసుక్క. సిపిపి
దీపంపెట్టవచ్చును. ఇంత అందమైనమనిసి యీ పెపంచకములో
లేదు. ఇటువంటిది ఆకరణీకుపికి భార్యాయెల్లా అయిందో. కర్మం
ఇది నాకోరికతీర్పడాని కొప్పుకుందంటే నాభాగ్యం పండినట్లే.
ఇంక ఆలస్యంసెయ్యడం యెందుకు? నెమ్మదిగా యాపారం జరుపు
దాం. [పకాశముగా] కరణీకుడి భార్యాయా యేంటి?

జయ—[తనలో] ఇదుగో వైశ్యుఁడు. అక్కటా! ఎన్నఁడును నంతః
పురమువిడచియెఱుంగని నేనిట్లు రావలసివచ్చెనుగదా! [ఇంచుక
యూరకుండి] ఇప్పుడీవిచారమేల? భత్యమునిమ్మని యీతనినడిగి
తీసికొనిపోయెద. [పకాశముగా] సెట్టిగారూ! మాతాలూకు

భత్యమునిచ్చి ననుఁబంపుడు.

నార—భత్యానికే! ఇదంతా నీదికాదూ! ఇప్పుడేగావచ్చావు! అప్పుడే వెళ్లాలి. ఇంతలో మించిపోయిందేముంది.

జయ—అయ్యా! నాభర్త నాకై వేచియుండును. సత్వరముగఁ బంప గోరెదను.

నార—అబ్బో! మాదొడ్డబత్తదొరికాదు. ఎక్కడో, కాకిముక్కుకు దొండపండుగట్టినట్లు కట్టినారు. ఆమొగుడును సూసి తెగమురుస్తావు.

జయ—[తనలో] ఈతనివాక్యము లిట్లున్నవేమి? ఈతడెట్టివిధమైన దుష్టబుద్ధినిఁ బూనియున్నవాడు కాఁడుగదా? [ప్రకాశముగా] అయ్యా! ఆతడెట్టివాడైననేమి? నాకు భగవత్సముఁడు.

నార—[తనలో] అబ్బో! ఈవిడ సాలాపతివ్రతలాగుందే. నానంగతి బయలేస్తే "ఊ" అందామేంటి. అనకేం! బాగ్యంసూచి వలచి రాదడదూ! [ప్రకాశముగా] సూడు. యీ మాటకేమిగాని, ఆకరణీకుణ్ణి పెళ్ళిసేసుకోడంసేత్త, కూటికి గుడ్డకు మొహం వాచావు నీఅందానికి ఆతడు పెనిమిటేవిటి? నాకేం నచ్చలే. అబ్బే.

జయ—[తనలో] ఈతడిట్లేల వినవ్యగ్రముగాని సంభాషణసేయుచున్నాఁడు. చూడఁగా నీతఁడు నాయెడల నేదియో ద్రోహచింతను బూనియున్నట్లు తోఁచుచున్నది. హా! పరమేశ్వరా! నాకేవిధమైన యాపదయుఁగలుగకుండ రక్షింపుము. [ప్రకాశము] సెట్టిగారూ! ఈ యనవసర ప్రసంగమేల. భత్యమునిచ్చినఁ గొనిపోయెద. లేదేని పోనింతు.

నార—నీయందానికి బత్యమా. సిగ్గు సిగ్గు. నాబాగ్యంలో సగం బాగ్యం యిమ్మన్నా యిస్తాను. తిరుగుడు తెలిసిందా?

జయ—[తనలో] ఈతడు నిశ్చయముగా నాయందు దుష్టబుద్ధినిఁ బూనియున్నవాడు. అక్కటా! ఇప్పుడు నేనేమిసేయుదును. కానిమ్ము. ఈతనితో నింక సంభాషింపకుండ సరిగెదఁగాక. [ఇంచుక

నడచి] ఏమిది! ద్వారములన్నియు మూసియున్నవే. ఏమిదారి ! (ఆలోచించుచున్నది.)

నారా —దారేమీ లేదు. నన్ను దయనూడవే దారి. సూడు. యెఱ్ఱిబె ట్లుపోక, యీలాకూర్చుండు. ఎన్నాళ్ళనుండో నీమీద భ్రేమ. ఎవ్వ రిసేతనైనా కబురంపితే యేమనుకుంటావో అని యీయాల యిల్లా చేశాను. ఆ కూడు గుడ్డలేని కరణీకుసితో యేవిశాపురం చేస్తావు నీమాట, నామాట వొకటైందంటే, చెప్పనా, యీభాగ్యం అం తా నీదే అనుకో, ఇందుకుతప్పితే తల్లితోడు.

జయ—(తనలో) పాపముశమించుగాక. ఈతని హృదయమును సంపూ ర్తిగా చెలిఁబుచ్చినాడు. పరమేశ్వరుఁ డీతనికి మంచిబుద్ధి ప్రసాదిం చుగాక ! (ప్రకాశముగా) అన్నా ! అనరానిదియు, వినరానిదియు న గు పలుకుఁ బలికినందుల కెంతయుఁ జింతయయ్యె. అను! (12)

చ। పరసతు లెల్లఁ దల్లులని • భావమునం దలపోతమాని; యీ
నరణిని నన్నుఁ గోరుదువె • సజ్జను లెల్లరు నవ్వరా ? యుఁగో
తరుణియు నిన్ను వీడి చన • దా ! యపనిందయు నెత్తి నెక్కదా
నరిసరి యేటిమాట లిఁకఁ • జాలును బుద్ధి మరల్పుమీ వెసన్

నారా—ఏవిటో ! ఈమాటల కేవిటి ? పున్నెవేవిటో పాపవేవిటో. నీ యందం సూశాను. యెఱ్ఱిలో పడిపోయినాను. ఆ సంగతి అల్లావుం చు నాకోరిక నీవు తీర్చినావంటే నిన్ను రాణీకిమల్లే సేస్తాను. ఈ దరిద్రమంతా పోతుంది. నీకింద కావలసినంతమంది దాసీల్నెట్టాను నువ్వు అడుగుతీసి అడుగెట్టక్కరలేదు. కోవటితో స్నేహం కోటి లాభాలన్నారు. తెలిసిందా!

జయ—శివా శివా ! ఎట్లు బలుకుచుంటివి. నీవు నాకు సోదరునివంటివా డవు. అన్నా ! పరసతీ గమనమున మిగుల పాపము సంభవించును. అను (14)

చ॥ పరులెవరైన విన్న బలు • భంగుల దూషణసేతు, రాలియున్
బరుసములాడు స్నేహితులు • పజ్జకు జేరరు, మోము నెత్తి న
ల్వారలగన గష్టమౌను ధన • మున్ నశియించును, గీర్తి బాయు నీ
పరయువతియున్న వాడవె ప • రాంగన గోరుట పాపమౌ కదా!

తెలిసియో తెలియకనో యడిగితివి. నేను నీవు తలంచిన గుణముగల యువిదనుగాను. నేను సాధ్విని, భర్తృపదాంబుజసేవ దప్ప నాకన్య మవసరము లేదు. పూర్వజన్మకృత ప్రారబ్ధమున మేమిట్లు వచ్చితిమి.

నారా— ఏవి సక్కని మాటలు. అమృతం వొలుకు తుందారు. నువ్వుసెప్పేమాటలు నాతలకెక్కుతాయా. నీవు నన్ను కరుణ సూశావంటే యెంత పాపానికైనా వోరుస్తాను. ఆబయ వేవీ లేదు. ఈవాళ నీవు నాకోరిక తీర్చాలి. నేను జెంచెయ్యాలి లేకపోతే సస్తుంటాను. ఇదే పంతం ఇదిగో! ఇంట్లో సిన్నమాట, యెవరైనా సూస్తారేమో అని బయంగా వుందా యేమిటి? ఆలాటిబయం వద్దు. నాయింట్లో జరిగిన సంగతి సూర్యశంద్రుల్లుకూడ తెలుసుకోలేరు. సూడు. అన్నితలుపులు వేసున్నాయి. ఇంక మారుమాట సెప్పకరా. కోటికిపడగెత్తిన కోమటిని. ఈలా అడుగుతుండగా నీవిల్లాసెప్పడం దర్మంగాదు మల్లాకాదైతే ప్రాణాలొంటాను.

(సమీపింపబోవును)

జయ—(కోపముతో) ఛీ! దూరముగానుండుము.

తే॥ గీ॥ పరసతుల గూడ దలచుచు నా • బ్రహ్మ నీకు
భాగ్యమిచ్చెను నింతగా • పశువ! నీకు
చేటుకాలము వచ్చుట • చేత నన్ను
సాధ్వి నిటు గోరుచుంటివి • సాహసమున

నీకు వినాశకాలము సమీపించినది.

నారా- ఏవి సివాట్లు, ఇయ్యన్నీ నాకు దీవవలె నీమాటలకు నేను కోం
పడతా ననుకున్నావాయేవిటి. కోంపడను- సాధారణంగా ఆడోళ్ళ
యిల్లాటి యాపారం వచ్చినప్పుడు ముందు కోం పడడం ఆశారం-
ఈకిటుకులన్నీ నాకు తెల్సునుగా- కోపటోడిపట్టు భల్లూకపు పట్టు

జయ-(తనలో) నావాక్యములచేత నీతఁడు తనబుద్ధిని మరలించు కొను
నట్లులేదు- ఆవలకుఁ బోవుదమన్న దలుపులన్నియు మూయఁబడి
యుండునట్లుజేసినాడు- ఇంక నా సామవాక్యములచేఁ గాని కోపవా
క్యములచేఁ గాని ప్రయోజనము లేదు- నేను శాంతవాక్యములచే నీ
తని నావలకుఁబంపి, నే నెట్లైనా మార్గముఁ జూచుకొనవలయును-
లేనిచో మోసమువాటిల్లును, (ప్రకాశముగా) ఓ! వైశ్యకులప్రదీ
పా! నీవు దారిద్ర్యము బాపెదనని చెప్పటం జేసి నాకేమిగా అంతః
నీ చిత్తవృత్తి నారయుట కట్లు వక్కాణించితిని గాని మఱియొకటి
కాదు. నాకోపవాక్యములకు నీవు మన్నించి నావాంఛమాత్ర మొ
క్కటి తీర్పవలయును.

నారా—నాప్రాణ మిమ్మంటే యిస్తాను. యేంకావలో సెప్పేశెయ్.

జయ—మఱేమియును లేదు, మీరు నన్నేరీతిగ సత్కరించఁ దలంచితిరో
యది తీసికొనిరండు. నే నిట్లడిగితినని మీరు మఱియొక విధమున
భావించ వలదు-

నారా—(తనలో) వొట్టి యెఱ్ఱిది- సంతోష హాస్యానో లేదో అని
అనుమానం- (ప్రకాశము) ఇదిగో నీకిప్పుడెయ్యి వరహాలు తెచ్చి
యిస్తాను- వుండు- (తలుపు ఆవలవేసికొని పోవును).

జయ—(తనలో) ఈతడావల కరిగినాడు- నేనావలకుఁబోవు మార్గము
లేదు- అక్కటా! నాప్రాణేశ్వరుఁడు నాకై యెంత నిరీక్షించుచుం
డునో కదా! పరమేశ్వరా! మాకిట్టి సంకటంబుల గలిగించు
చుంటివి. రాజ్యభ్రష్టుల జేసి, తుదకు గూలి జేసికొని జీవించు
చున్నను నోర్వలేక పోతివా? అయ్యో! నోరెఱుంగని పసికూనలు
నాకై యెంతవిలపించుచుందురో- [ఇంచుక యూరకుండి] నే నిట్టి

లోచించుచు జాగుజేసితినేని మరల నావైశ్యుడురాగలడు- [ఇటు నటుఁజూచి] ఇదిగో! ఇచ్చటనొక పెద్దపెట్టెయున్నది- నేనిందు ప్రవేశించి డాగెదఁగాక! దీనిని నానాధుఁడుదప్ప మరెవ్వరును దెఱచుటకు శక్తులుగాక యుందురుగాక! [పెట్టెనుసమీపించి] పార్వతీశ్వరా! నేను నీచరణసేవకు దూరమగుచుంటిని- సంపద శత్రువులచే హరింపఁబడినను నీచరణసేవయే మహాభాగ్యమని తలంచిన నేనిప్పుడు నిన్ను నెడబాయుచుంటిని- నేనీ దురాత్ముఁడగు వైశ్యునిచే నిట్లుజిక్కితినని నీకెవ్వరు తెలుపుదురు- మరల నీదివ్య మంగళవిగ్రహ సందర్శనము నేనెప్పుడు జేసికొందును- నోరెఱుంగని పసికూనలతో నీవెట్లుకాలంబుగడపుదువోకదా! నాజాడదెలియక నాకై నీవెంతగాఁ జింతించెదవో! కానిమ్ము, ధర్మదేవతయే నిన్ను రక్షించుగాక! ఓ పరమేశ్వరా! ఆర్తత్రాణపరాయణా! కుమారసహితముగా నానాధునిరక్షించుభారము నీయందున్నది. ఓ భగవతీ! కాత్యాయనీ! నేనీపెట్టెయందుఁ బ్రవేశించుచుంటిని-
అను॥ (18)

తే॥ గీ॥ తల్లికాత్యాయనీ! నీవు ♦ దయను నాదు
విభుఁడుదప్ప వేఱొకరి కీ ♦ పెట్టెఁ దెరువ
శక్తిలేకుండునట్లును ♦ సలుపుమమ్మ
యార్తనై వేడుచుంటిని ♦ నధికభక్తి॥

జగదీశ్వరివగు నిన్నునమ్మిన మాకేకొఱంతయును గలుగకుండుగాక! [పెట్టెలోడాగుచున్నది- పెట్టెమూతపడును-]

[నారాయణసెట్టి ప్రవేశించును-]

నారా—[తనలో] ఈవాళ నాభాగ్యంపండింది- మొదటసొమ్ము పోతేనే, మొదట రవ్వంతబెట్టుచేసిందిగాని, తరువాత సొమ్ము కొళపడింది- [ఎదుటఁజూచి] ఏదీ! ఆకాంత సరసానికి ఎక్కడైనా నక్కింది కామోసు- ఓసబ్బా! సరసాలు- రా! యిట్లారా! నీకుగావలసినంత

సొమ్ముపుచ్చుకో. నేను వెనుకకు తీసేవాణ్ణి కాను. (పరీక్షించి) కన బడదేం. మాయమైంది నెమ్మదిగా యివతల కెళ్లిందా యేమిటి? ఎల్లా వెళ్ళుతుంది- తలుపులన్నీ వేసున్నాయి- ఎగిరిపోవడానికన్నా పైకప్పు అడ్డుంది- ఇదేమిటో మాయగావుంది- [గదియంతయు నలుప్రక్కలఁజూచి] ఇందెక్కడా లేదు- ఈపద్దపెట్టె యింతకు ముందు తెరిచివుంది- ఇప్పుడు మూత వేయఁబడివుంది- ఒకవేళ యిందుదాగిందేమో- [మూతనెత్తబోయి] ఏమిటీచిత్రం మూత రాదు తాళములేని యీపెట్టె యేలాపడ్డదో కదా! [తీయుటకు ప్రయత్నించి] అబ్బా! ఎంతతంటాలుపడ్డా గాకుంది- ఇదేం కొంప మునుగుతుందో. వళ్ళువొణుకుతూవుంది- ఈసంగతి రాజుకు తెలిసి దంటే నన్ను బతకనియ్యడు- [పిడితలుపుదీసి] ఓరీ! ఎవడురా!

సేవ—[ప్రవేశించి] ఏమిసెలవు

నారా—సెలవేమిటరా- కొంపమునిగింది- కరణీకుడిభార్య యీపెట్టె లో నక్కింది- పెట్టె మూత రావడంలేదు- నచ్చిపోతుందేమో మార్గమేమిటి?

సేవ—పెట్టెమూత రాకపోవడం యేమిటి- (పెట్టెతీయుటకుఁ ప్రయత్నిం చి) ఇది చాలా చిత్రంగా వుంది. ఆవిడకు మీయందిష్టము లేక యిట్లు జేసినది.

నారా-ఓరీ! నాశరీరము వొణుకుతూవుంది- కరణీకుఁడువచ్చి నాభార్య యేదంటే యేమయిందని సెప్పను- ఈపని యెందుకు చేశాను- లేని పోనిది తెచ్చిపెట్టుకొన్నాను- (ఇంచుక యూరకుండి) మనమీలా ఆలోచిస్తూ కూర్చుంటే కొంపమీదకు వస్తుంది- కాబట్టి యిద్దఱినా ఖలఁను తీసికొని వచ్చి, యీపెట్టె బ్రద్దలు కొట్టించాలి. అప్పుడు గూడా సాధ్యంకాకపోతే, మనదొడ్లోవున్న పాకలోపెట్టించి పాకకు నిప్పంటిద్దాం- కరణీకుఁడువచ్చి అడిగితే బత్యం తీసికొని వెళ్ళింది. తరువాతసంగతి మాకు తెలియదని చెప్పుదామురా ఆలోచిస్తే లాబం లేదు. (నిష్క్రమింతురు)

రంగము:— (నారాయణశెట్టి గదియందు ప్రవేశము)

నారా—(తనలో) కుడిచి కూర్చుండలేక కొంపమీదకు తెచ్చిపెట్టుకున్నాను- ఎన్నడు పుట్టని బుద్ధి నాకు పుట్టింది- ఆ కరణీకుడి భార్య యీపెట్టిలోవుండి యివతలకు రాకుండావుండి- పెట్టె యెంతమందిబద్దలు గొట్టినను కాస్తఅయినా పగలలేదు- దొడ్లో పాకలోబెట్టి నిప్పంటించినా పాక తగలబడిపోయింది గాని పెట్టెయెప్పటిమోస్తరుగానేయుంది. ఆకరణీకుడువచ్చి అడిగితే మాకు తెలియదని చెప్పినాను. ఇప్పుడీ పెట్టెను యేమిసెయ్యాను- నాయింట్లో యెన్నాళ్ళని వుంచుకోను- ఈసంగతి రాజుకు తెలిసిందంటే తలతీశేస్తాడు- (ఆలోచించి) ఇంక మరో ఆలోచన లేకుండా దీనిని సముద్రములో అర్ధరాత్రిపట్టించుకొని వెళ్ళి పారవేయిస్తాను- అదే మంచిదారి-

జయ—(పెట్టెలో తనలో) పరమేశ్వరి యనుగ్రహమున, నీపెట్టెమూత, దెఱచుట కెవ్వరికిని శక్తిలేకయుండెను. తుదకీతడు దీనిని నగ్నిహోత్రము పాలుఁజేసినను నాకావంతయు ముప్పు ఘటిల్లలేదు- ఇప్పుడీతఁడు నన్ను సముద్రమునఁ బాఱవేయించుటకుఁ దలంచుచున్నాఁడు. కావున నుపాయముచేత నేనీతని నాయుద్యమమునుండి మరలించవలెను- (ప్రకాశముగా సెట్టినుద్దేశించి; సెట్టీ! ఇంతవరకును నీవు నాయెడలజేసిన ప్రయత్నములన్నియు విఫలములైనవి- ఇంక సముద్రమున బడవైచినను దడవదు- చెడదంటము- నీవేల వృథాశ్రమ వహింతువు- నాకొక వ్రతముగలదు- అది యారుమాసములకుఁ బూర్తియగును-తరువాత నీపెట్టె దీనంతట నదియే తెఱచుకొనును. అంతవఱకును నీవు సన్నిందే యుంచి జాగరూకతతో సరయుచుండుము-

నారా—[తనలో] ఏమి ఈ యాశ్చర్యము- ఆఱుమాసములవఱకు నిందున్న ఈమె యన్నమాదినక నీరుద్రావక యెట్లాబ్రతుకుతుంది-

ఈమెకొక వ్రతమున్నదట ఆవ్రతమైనతరువాత నీమె బయలుపడునట. అప్పుడు నాకోరికతీరుస్తుందికావ్రాను- కాబట్టి నేను దీనిని సముద్రంలోకాఅవేయించక నాయింటనేవుంచి భద్రంగా కాపాడుతూవుంటాను- నేను రహస్యంగా వుంచుతాను- ఎవరికిని దెలియదు. (ప్రకాశముగా) నీవు చెప్పినట్లే చేస్తాను- (ప్రకాశముగా) చూడు పిల్లా - నీవ్రతసమయం అయినతరువాత మనమాట ఒకటికావాలి సుమా-

జయ—(దైవము నుద్దేశించి)

సీ॥ అత్నేశు సేవకు • నతిదూరమై వైశ్యుచే
జిక్కి యీపెట్టెఁ • జేరినాను
వ్రతమొండు గలదంచ • పాయంబు రాకుండ
నరసి రక్షింప బొం • కాడినాను
గాన నాయందు స • త్కరుణ బూనుచు నాదు
జీవితేశుని వేగ • జేర్పుమయ్య
యంత పర్యంతము • నాకలి దప్పులు
గలుగకుండెడి రీతి • సలుపుమయ్య
తే॥ గీ॥ నిన్న నిరతంబు మదినమ్మి • యున్న నాదు
ప్రాణనాథున కిట్టి యా • పదయుగల్ల
కుండ నరసి రక్షింపుమా • కూర్మితోడ
దీన మందార శ్రీపార్వ • తీ కళత్ర ॥

నారా—(తనలో) ఈమెచెప్పినట్లు చేస్తాను-

[నిష్క్రమించును.]

ఇది తృతీయాంకము.



# పురూరవ

## చతుర్థాంకము.

---

రంగము:—

(సెలయేటియొడ్డు - ప్రవేశము:— ఇద్దరుకుమారులను చెరి
యొక చంకనుబెట్టుకొని - పురూరవుడు ప్రవేశము- అను (15)

పురూ—ఆహా! రాజ్యమంతయు గోలుపోయినను, విచారమందక
భార్యాపుత్రులు వెంటనుండిరి కదా యని సంతసించుచు గలిప్రిర
ణంబునఁ గూలిజేసికొని జీవించుచున్నను - నధైర్యమందక యెప్పటి
కైన శుభదినంబులు వచ్చుననితలంచి, పరమేశ్వరుని నమ్మియుండ-
దుదకు నాకీగతిపట్టినది. భత్యము దెచ్చుటకై వైశ్యునిగృహమున
కరిగిన నాభార్య రాకపోవుటయేమి! ఆమె యుదంతము వారి
నడుగగా, మాకు దెలియదనిరి- హా! రమణీమణీ! జయప్రదా!
అను (15)

సీ॥ మోహంబు నాపైనఁ • బూని, నృపాలకుల్
వీక్షింప నన్ను వ • రించినావు
నను బాయగాలేక • నాసేవలనుగోరి
వనులకు నావెంట • వచ్చినావు
నీదివ్య సేవయే • నిఖిల సంపదలంచు
గడు ముదంబున నాకు • నుడివినావు

చిత్తమందున వెంగ • తేరనీకుండఁగ
ధైర్యంబు వహియించి • తనరినావు
తే॥గీ॥ నాసుఖమె నీసుఖమని మ • నంబునందు
దలచి నాతోడ నిరతంబు • మెలఁగినావు
యువిద ! యిప్పుడెచ్చోటి నీ • వున్న దాన
వకట ! ననుబాయదగునె నీ • కమలచరిత ॥

అయ్యో ! కాంతా ! నన్ను విడచి నీ వెంకు బోయితివి. ఇట్టికష్టములు పడజాలక బ్రదుకుపైరోసి ప్రాణముల బాసితివా ! "నాథా ! ఎన్ని యిక్కట్లు వచ్చినను, మిన్ను విఱిగి పైబడినను- నిన్నెడబాయనని నీవు చెప్పిన పలుకులు మఱచిపోయితివా"! ఏ క్రూరుని చేతికైన నజిక్కి నాకై పరితపించుచుంటివా ! నీయుదంతము నాకెట్లు తెలియును. అక్కటా! ఈకుమారులను నేనేమి సేయగలను- వీరిని నేనెట్లు సాకుదును, ధనమదాంధుడైన యావైశ్యుడు నీకే యుపాయమైన గూర్చియుండడుగదా ! నీకై పురమంతయు గాలించితిని- నీజాడ యెచ్చటను గానబడ దయ్యెను- (కుమారు లేడ్చుటవిని) నాయనా !

తే॥గీ॥ ఏడువకు నేఁడవకు నీవు • నేడ్వబోకు
నిన్నురక్షించు చుండెడు • నీదుతల్లి
నిన్ను విడిచి యెటకో చనె • నేడు కుఱ్ఱ
దేవుడే నీకు నాకును • దిక్కుసుమ్మ ॥

(రోఁడవకుమారునిఁ జూచి)

తే॥గీ॥ చంద్రబింబంబు హసియింపఁ • జాలునీదు
మోము కడువాడియుండెను • ముద్దుకుఱ్ఱ
యెండసోకిన కతమున • నిప్పుడకట
యేమిసేయుదు నింక నా • కేది తెరువు.

కుమారులారా! మీయాకలి నేనెట్లుతీర్తును. (ఇంచుకయూరకుండి) నేనీరీతిని జింతించుచున్నందువలనఁ బ్రయోజన మేమియులేదు- నేను నెమ్మదిగా నీప్రవాహమునుదాటి యావలనున్న పల్లెజేరఁ గొందునుగాక- ఈయిరువురికుమారులతోడను. నీమూటతోడను నొక్కసారిగ ప్రవాహమునుదాటి పోవుటకష్టము గావున ముందుగ నీమూట నావల గట్టునబెట్టివచ్చి యొక్కొకనినే యావలకుఁ జేర్చెదగాక! నేను మరల వచ్చువరకు నీబాలురు ప్రవాహములోనికి దిగుదురేమో! ఈవృక్షము క్రిందనున్న తీగెకు వీరిని గట్టెదగాక.

(యేటియొడ్డుననున్న వృక్షముక్రింద తీగెలకు కుమారులను గట్టి) తంద్రులారా! నేనీమూట నావల గట్టునబెట్టివచ్చి మిమ్ముదీసుకొని పోవుదును. (ప్రవాహము దిగి కొంత దూరమరిగి) అయ్యో! ఏమిది! ఈ ప్రవాహము లోతుగనున్నది- అందుటలేదు- కాళ్లు తేలిపోవుచున్నవి- అక్కటా! కొట్టుకొనిపోవుచున్నాను- అయ్యో! కుమారులు! తనయులారా! మీకింక నెవ్వరుదిక్కు- (ప్రవాహమునఁగొట్టుకొని పోవుచు నిష్క్రమించును)

[గొల్ల - చెంగి - ప్రవేశించును)

చెంగి—(తనలో) అబ్బా! ఎండ వేడిమి చాల యధికముగానున్నది. ఆ చెట్టు నీడను కొంచెము విశ్రమించి యింటికి వెళ్ళెదను-

హా! నాయనా! (కుమారులు ఏడ్చుటవిని) ఏమిది! పసికూనల యేడ్పు వినవచ్చుచున్నది. (ఇంచుకనడచి) ఇదేమివింత! ఈబిడ్డలెవరో కదా! ఈతీగెకు యెవ్వరో కట్టివేసినారు. అయ్యో! వీరికెవ్వరును దిక్కులేరుకాబోలు! బిడ్డలులేని నాకు భగవంతుడీ కుమారులను బ్రసాదించినాడు- నేను పూర్వజన్మములో గొంతపుణ్యముచేసి యున్నాను- వీరి నింటికి దీసుకొనిపోయి పెంచుకొందునుగాక!

(తీగెకుకట్టబడియున్న కుమారులను విప్పి)

ఆహా! ఏమి మొగములు సూర్యచంద్రులవలె నున్నారు- నా పుణ్యమున వీరు దొరికినారు-

కుమా — మా నాయన యేడి !

చెంగి — (తనలో) వీరితండ్రి వీరికి దూరమైనాఁడు కాబోలు. (ప్రకాశముగా) బిడ్డలారా ! మీకు భయము లేదు. రండు. మీకు బువ్వ బెట్టెదను, (కుమారులతో నిష్క్రమించును)

—:o:—

రంగము :—

[దేవపుర ప్రాంతారణ్యభూమి — ప్రవేశము].

గొల్లవాని వేషముతో పురూరవుఁడు ప్రవేశించును అను (16).

పురూ — హా ! పరమేశ్వరా ! నాకెట్టి సిలుగులు గల్పించుచుంటివి. నేను నీయెడలఁ జేసిన మహాపరాధమేమియున్నది. రాజ్యశ్రీలను బాయఁజేసితివి. సతినెడఁబాపితివి. పుత్రులను దూరముగఁ జేసి దిక్కులేనివారిగ నొనర్చితివి. ఆప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుండ, ఆప్రాంతమున నున్న గొల్లలు నాయెడల గరుణామయులై నన్ను నీరములనుండి బైటకుదీసి రక్షించిరి. రక్షించుటయేకాదు. గొఱ్ఱెలను గాయుచుండుమనియు, నన్ను వస్త్రములనిచ్చి సాకెదమని చెప్పి యొల్లు సేయుచుండిరి. హా ! దేవా !

సీ॥ సకల సామంత రా • జన్య చూడామణు
లరిగాపులై గొల్వ • నలరినాఁడ
ఇలలోన నాకును • నెదురేమి లేకుండ
ఘనచక్రవర్తిగాఁ • దనరినాఁడ
పరరాజులకు గుండె • బల్లెమై సతతంబు
భూరి శౌర్యంబునఁ • బొలిచినాఁడ
పాకారి మించిన • భాగ్య భోగములతో
వేడ్కమీఱఁగ నెప్డు • వెలసినాఁడ

తే॥ గీ॥ అక్కటా! నేటికీరీతి • నన్ను విడచి
నాడు- సతిసుతులను విడ • నాడినాడ
తుదకు గోత్రిల కాపరి • పదమునంది
భువిని నీచ జీవమును • బొందినాడ॥

హా! జయప్రదా! నామూలమున గదా నీవట్టి కష్టముల బొం దవలసి వచ్చినది. రాజ్యమువిడిచి నేనరణ్యములకు వచ్చునప్పుడు నా వెంట రావలదనియు, బిడ్డలతో గూడ నీపుట్టినింటికడకు బొమ్మనియు నెంత చెప్పినను వినక నావెంటవచ్చి యిట్లయితివికదా! నేనుచెప్పినట్లు నీవు చేసియుంటి వేని యిట్టి యిక్కట్లను బొందియుండవుకదా! హా! నారీమణీ! రాజాధిరాజు- చక్రివర్తి భుజబలపరాక్రమ శౌర్యవిరాజి తుఁడు- అనితలంచి, యీ పురూరవుని బెండ్లియాడి సందులకు నీవందు చున్న సౌఖ్యమిదికదా! ఆగర్భశ్రీమంతు రాలవును, రాజపుత్రికవును, సాధ్వీమణివియునగు నిన్ను సామాన్య నీచకులాంగనవలె, భర్త్యము తెచ్చుటకై పంపిన పాపము నన్ను గట్టికుడుపక మానునా? అయ్యో! సతీమణీ! నీవెచ్చట నున్నావు- ఎట్టికడగండ్ల గుందుచున్నావు- నాకె ట్టిసంకటములు ప్రాప్తించినను నీవును, కుమారులును నాప్రక్కనుండుట చే వానిని మఱచి యానందముతోడనే యుంటిని- ఇక నేనిప్పు డెవ్వరిని జూచుకొని ధైర్యము మనంబున బాదుకొల్పుకొనును- నిన్నావిధిబాసితిని. కుమారుల నట్లు విడిచితిని- ఒకరి సంగతి యొకరికి తెలియదయ్యె- నే నిప్పుడేమి చేయుదును.

సీ॥ రాజాధిరాజునై • రహిమించు నేనిప్డు
కూడు గుడ్డలకునై • గొల్లనైతి
మేలుగా పట్టుశా • లీలను, మొయిదాల్చు
నేనిప్డు గొంగళి • బూనినాను
కరమందు నిరతంబు • ఖడ్గమూనెడు నేను
వెదురుకట్టను బూని • వెలసినాను

మందిరారామసీ • మల వెలసెడి నేను
భీకరాటవులలో • వెలసినాను
తే॥ గీ॥ ఆలుబిడ్డలతోడ సౌ • ఖ్యంబులందు
నేను, దిక్కులేకీరీతి • నగడినాను
కాలమొక్కరీతి గడుప • గా దరించె
యెట్టివారికి నైనను • నెంచిచూడ ।

అయ్యో! నాపుత్రులెచ్చట నున్నవారో! వారికేమి గతియో! ఆసెలయేటి యొద్దన - నావృక్షముక్రింద తీగెకు గట్టివచ్చితిని- ఏమృక్కడి మృగమైన మెక్కెనేమో! అక్కటా! నేనెంతపాపపు జన్మమెత్తితిని- భగవంతా! ఆలుబిడ్డల నావిధిని కడగండ్లమొందిన యీదుర్మతుని ఈకఠినచిత్తుని బ్రతికించితి వేల। ఓ-ప్రాణవాయువులారా! నాశరీరమునుండి మీరేల లేచిపోవకయున్నారు। ఓభూమ్యాకాశములారా! నన్నేల మీరు నలిపివేయరు- ఓదేవతలారా! నన్నుఁజంపి వేయుడు- భార్యాపుత్రులనుబాసి దిక్కులేకయున్న యీపురూరవుని జీవితము వ్యర్థము-
[మూర్ఛిల్లును] [కలిప్రవేశము]

కలి—(తనలో) ఈపురూరవునకు గల్పించవలసిన కడగండ్లన్నియు గల్పించుచుంటిని భార్యకును భర్తకును దూరముజేసితిని- బిడ్డలనెడబాపితిని- ఈతనికిట్టి నీచస్థితి గూర్చితిని- ఇంకను నీతని ద్రిప్పలుబెట్టవలయును- జయపురాధీశుని యంతఃపురమునకు నిరువురు చోరులను గల్పించి పంపి రత్నాభరణంబులుండు పేటికను దెప్పించితినిగదా! యీపేటిక నీతనియొద్దఁ బెట్టి నేనేగెదగాక-
[వస్తువుల పెట్టెను - పురూరవునిముందుబెట్టి నిష్క్రమించును].

[ఇరువురు రక్షకభటులు ప్రవేశింతురు].

మొ-రక్ష—ఏమిరా! మనకీ కర్మమెక్కడినుండి దాపరించినది. ఎన్నడును రాజమందిరములో దొంగతనము విని కని యుండలేదు-అంతః

పురములోనికి చోరులెట్లు జొచ్చిరి- ఆభరణముల పెట్టె నెట్లుతస్క రింపఁ గలిగిరి.

రెం-రక్ష—ఇదియంతయు నాకు మాయగా నున్నది. ఏమైననుమనము వెదకి చోరులను బట్టుకొనలేకపోయినచో మననోట్లోమన్నే- నా ఖరీకి నీళ్ళువదలుకొన వలసినదే. (ఇంచుక నడచి) వీడెవడు ఈచె ట్టుక్రింద పరుండి యున్నాడు. (సమీపించి పరికించి) ఓహో! వెదక బోయిన తీగ పాదములకు దగిలెనన్నట్లు మనకు వీడిక్కడనే కనిపిం చినాడు- ఇదిగో! వీని ప్రక్కను పెటెగూడ నున్నది- వీడేచోరుఁ డు- (పెట్టెను బట్టుకొని పురూరవునిఁ జూచి) ఇకలే- (చేతితోకొట్టి లేపుదుగు)

పురూ—ఎవరయ్యా! మీారు! నాఅవస్థలో నేనుండి యేడుస్తూ పడు కొని యుండగా మేల్కొలిపెదరు-

మొ-ర—సావకాశముగా నిద్ర పోవచ్చునులే- నిశ్చయముగా పడు కొన్నావు?

పురూ—(లేచి) మీారెవ్వరు?

రెం-ర—మేము రాజ భటులము-

పురూ—అయిన. నాతో మీాకేమి పనియున్నది?

మొ-ర—నిన్ను దోడ్కొనిపోవుటకు వచ్చినాము-

పురూ—ఎక్కడికి?

రెం-ర—చెఱసాలకు

పురూ—ఎందుకు?

మొ-ర—తెలియనట్లుమాట్లాడెద వేమి! రాజాంతఃపురములోని నగలపె ట్టెను తీసికొనివచ్చి, లింగముమ్రింగిన పూజారివలె నిక్కడ పడుకొని యున్నంతమాత్రమున దప్పుననుకొంటివా యేమి? ఈపెట్టె యెక్క డిది?

పురూ—అయ్యా! ఇదియేమి చోద్యము, నేను గొఱ్ఱెలగాచు గొల్ల వాడను- ఆలుబిడ్డలకు దూరమై యిచ్చట నేడ్చుచు బండితిని- ఏ

పాపమెఱుగను. ఈపెట్టె యిక్కడకెట్లు వచ్చినదో నాకు తెలియదు.

మొ. ర — నీపేరెవరు?

పురూ — మాధవుడు.

రెం. ర — మనకిప్పుడీ సంగతులన్నియు నేల! వీనిని బెట్టెతో దీసికొనిపోయి రాజుగారి సన్నిధిని బెట్టుదము. తరువాత విషయము వారే యాలోచించెదరు. (పురూరవునిం జూచి) పద.

పురూ — (తనలో) హా! ఎట్టి దుర్గతి కలిగించుచుంటివి భగవంతా.

తే. గీ. నాతి నారీతి నెడబాపి నావు; సుతుల
నెటకో పంపించినావు, నా కిట్టి నీచ
పదవి గూర్చితే గాక, ప్రపంచమెల్ల
నవ్వ దస్కరుం డనిపించి నావు భళిర!

(అందఱు నిష్క్రమింతురు)

రంగము — కారాగృహము

[పురూరవుఁడు - ప్రవేశము]

పురూ — [తనలో] ఆహా! కాంతాపరిత్యాగమునకు నేనేమని వగతును? ఇది యంతయు గలివహాయుగా నున్నది. ఆలుబిడ్డల నెడబాసి యిట్టి నీచస్థితి యందున్నందులకే వగతునా? అకారణముగ రాజాంతఃపుర చౌర్యము నామెడకు జుట్టుకొని యీకారాగృహమందు బడినందుకే వగతునా? ఆబ్రహ్మకృత్యములన్నియు నద్భుతము లేకదా! సప్తద్వీపసముద్ర ముద్రిత మహీచక్రంబు బరిపాలించు నేను - మహేంద్రవైభవంబును బురిడించు సౌఖ్యభోగములతో దులదూగిన నేను - సంగరమున శత్రురాజుల కంఠప్రదేశములయందు ఖరాసిని నాట్యమాడించిన నేను - అక్కటా! చెఱసాలయందా యుండుట - హా! తన్వీమణీ! జయప్రదా! చక్రవర్తియని సంతసించి నీవు వివాహమాడిన పురూరవు డెట్టి స్థితియందున్నాడో చూడుము. హా! పుత్రు

లారా! మీరు నాగర్భవాసమున జన్మింపక యేనిరుపేదవాని గర్భ
మునన్ జనించియున్నచో నిట్టి యగచాట్లను బొందక యుందురు
కదా! ఇప్పుడు మీరెందున్నారు? ఎవ్వరు రక్షించుచున్నారు!
మిమ్ములను నేనీజన్మమున మరల జూడగల్గుదునా? హా! జయ
ప్రదా! సంపూర్ణ పూర్ణిమా చంద్రమండలమును ధిక్కరించు
నీముఖమును నేను వీక్షింపగలనా? నేనట్టి భాగ్యమును నోచికొని
యుంటినా? హా! విరించీ! పురూరవుని నిట్టి నీచునిగా బరిణమింపం
జేసితివేల? హా! ప్రియవధూమణీ! విశాలనగర రాజపుత్రీ! జయ
ప్రదా! హా! కుమారులారా! [మూర్ఛిల్లును]-

[తెరవాలును]

రంగము—[జయంతుని కొలువుకూటము- ప్రవేశము]

జయంతుండు, మంత్రి, న్యాయవాదులు ప్రవేశము-

జయం—మంత్రీ! అంతఃపురమున బ్రవేశించి యాభరణముల పేటికను హరించిన తస్కరుడు పట్టుబడినాడట వానిం బిలిపింపుము- విచారింతము.

మంత్రి—[సేవకునిజూచి] సేవకా! నీవరిగి యాబంధింపఁబడిన చోరుని నిటకు దోడ్కొని రమ్మని కారాగృహ రక్షకునితో మాయాజ్ఞగా దెలుపుము-

సేవ—[చిత్తము] నిష్క్రమించి వెంటనే ప్రవేశించును

[భటులు- పురూరవుని దోడ్కొనివత్తురు]

సేవ—మహారాజా! ఇదిగో చోరుడు.

జయం—(పురూరవునిజూచి) ఓరీ! మాయంతఃపురము బ్రవేశించి నగలపెట్టెను హరించినది నీవేనా?

పురూ—రాజేంద్రా! నేను దొంగతనముచేయనిదే చేసితినని యెట్లుజెప్పుదును?

జయం—నీవు దొంగతనము చేయనేలేదా?

పురూ—నేనేమిచెప్పిన మీరారు నమ్మరు.
జయ—చెప్పదలచుకొన్నది చెప్పుము
పురూ—నేను తస్కరుఁడనుగాను.
జయం—నీ వెవ్వరవు?
పురూ—నేనొక గొల్లవానిదగ్గఱ గొఱ్ఱెలగాచుట కై పొట్టకొఱకు చేరితిని
జయ—[తనలో] ఈతనివాక్యములయందు మృదుత్వము గనిపించు చుండుటయేగాక, ముఖమునం దొకవిధమైన తేజము విరాజిల్లు చున్నది. ఈతడు తస్కరుఁడై యుండునా లేదా యను సందియము వొడముచున్నది.
న్యాయవాది—నీయొద్దకు నగలపెట్టె యెట్లువచ్చినది?
పురూ—నేను చెప్పఁజాలను. నేను నిదురించి లేచితిని. నిద్రకుఁబోవక పూర్వ మేమియును లేదు. ఎవ్వరో భటులుఁవచ్చి నన్ను మేల్కొలి పిరి. ఈపెట్టె నాయొద్దనున్నదని నన్ను బంధించి తీసికొనివచ్చిరి.
జయం—మంత్రీ! ఈతనివిషయము నాకేమియు దోచకయున్నది. ఇతడే దోషియని నిరూపించుటకు నామనంబేలకో సమ్మతింపకయున్నది.
న్యాయ—రాజేంద్రా! అట్లుతలంపరాదు. దోషులు తప్పించుకొనుటకై తామనేక విచిత్రగతులను మాటలాడెదరు. అంతమాత్రముచేత నిర్దోషియనరాదు. వీడు తస్కరుఁడుగాకపోయినచో నగలపెట్టె వీనికడ కెట్లువచ్చును. కావున వీని నవశ్యము శిక్షింపవలయును.
మంత్రి—ఆమాట నిశ్చయమే.
జయం—అట్లయిన వీనికిదగిన శిక్షయేది?
న్యాయ—తస్కరుని వధింపవలసినదని శాస్త్రమునందుఁ జెప్పబడి యున్నది. కాని మనమీతనికి కరపాదఖండనశిక్ష విధింతము.
జయం—ఓరీ! భటులారా! ఈతని వధ్యభూమికిఁ గొనిపోయి కరపాద ముల ఖండింపుడు. పొండు.
భటు—చిత్తము.

[భటులు పురూరవుని దీసికొనిపోవుదురు.]

జయం—మంత్రీ! నేటికి సభజాలింతము.

[ అందరు నిష్క్రమింతురు ]

రంగము:—వధ్యభూమి- పురూరవుఁడు, భటులుప్రవేశము]

పురూ—హా! దైవమా!

ఉ॥ రాజులు భక్తిగొల్వఁగ ధ • రావలయంబఖిలంబు కీర్తి వి
భ్రాజితలీలనేలు నృప • వర్యుని నీగతిఁజేయఁగల్గి యా
తేజ మడంచినావుగద • తీరెనె నీదగుకోర్కె; భద్రసం
యోజకుఁడన్నమాటకిది • యొప్పునె నీయెడ లోకనాయకా!

భగవంతా! ఇప్పుడు నిన్ను నిందించినంగూవలనమాత్రము ప్రయోజన మేమియున్నది. పెట్టవలసిన కడగండ్లఁబెట్టినావు- ఒకరిదారి యొకరికి దెలియకుండ నాలుబిడ్డలకును నాకును నెడబాపినావు- నీచులసేవ జేయించినావు- తుదకు చోరునిగాగూడఁజేసి, కరపాద ఖండనశిక్షగూడ వేయించినావు-

భటు-మొ—ఏమిటి! ఆలోచించుచున్నావు- నెమ్మదిగా మాకన్నులకు గంతలుగట్టి యీనాలుకు దాటిపోవలయుననియా యేమి?

పురూ—నేను మీచేతులలోనుండగా నేనెక్కడికిపోగలను- అదియును గాక నేను వాప్రాణములపై నాస వహించినవాడనుగాను-

భటు-రెం—అందుకనే రాజుగారియింట దొంగతనముచేసినావు- ఓరీ! ఇంతమంది రక్షకభటులుండగా నీవు లోపలికెట్లు ప్రవేశింపగలిగితివి- రాజుగారి శయనమందిరముననున్న యీ నగలపెట్టె నెట్లు గొని రాగలిగితివి? నీవు సామాన్యపుదొంగవుకావు. దొంగలకు గురుఁడవు- గజదొంగవు- నీ తెలివికిమాత్రము మేము సంతోషించినాము.

పురూ—రక్షకభటులారా! ఏల యీయనవసరమైనమాటలు,

భటు___ఓయీ! మేముకూడ నిక్కడజాగు సేయరాదు. నీవుసిద్ధముగ నుండుము.

పురూ___భటులారా! సిద్ధముగనుండుట కేమికావలయును. కరపాద ఖండనానంతరమునఁ బ్రాణములుపోవుట సత్యము- దగ్గిర నెవ్వరైన యాలుబిడ్డలుండిరిగనుకనా! వారికేమయినా చెప్పిపోవుటకు ఈసమయమున నాకు భగవంతుడే తోడ్పడవలయును-

భటు___ఇంతవఱకును వచ్చినపిదప నింకను భగవంతు డక్కడనీకు సహాయము సేయగలఁడు- అయినను నీయిష్టదైవమును మనసారస్మరించుకొనుము-

పురూ___[భగవంతుని నుద్దేశించి]

మ॥ ధనికుల్ పేదగ పేదలు ధనికులుగా ♦ ధర్మైకసంవేద్య దు
ర్జనగాఁదుర్జను ధర్మమూర్తిగను స ♦ ల్లాంతంబుగావించుచున్
ఘనుఁడా గారడివానిలీల! భళి! లో ♦ కంబేలుచున్నావు, నీ
మన మెవ్వారు గనంగశక్తులు సుధ ♦ ర్మాంభోధిచంద్రోదయా

శా॥ ఈపద్మాలుగు లోకజాలములకున్ ♦ ఎవ్వాడధీశుండు, నా
పాపధ్వంసుని నిన్ను వేడకొనెదన్ ♦ బల్మాగ నిసత్కథా
లాపంబుల్ శృతులానగించుచును సమ ♦ ల్లానంబు సంధిల్లగా
నాపై సత్కృపఁబూనిబ్రోవుము జగ ♦ న్నాథా? రమానాయకా

మ॥ నియమంబైన దదర్థమైన మనుజుల్ ♦ నిత్యంబు నీనామమం
త్రముబేర్కొన్న సహస్రకోటి భవకృ ♦ త్పాపంబులంబాసి వే
గమె ప్రాపింతురు నీకటాక్షగరిమన్ ♦ గైవల్యమున్ వారు శ్రీ
రమణా! దీనజనావనార్కకుల వ ♦ ర్యా! రామ! సీతాపతీ॥

భటు---నీదైవప్రార్థన పూర్తియైనదా?

పురూ___అయినది. ఇక మీరాపని మీరు చేసికొని వెడలవచ్చును.

భటు — (పురూరవుని పండబెట్టుదురు)

పురూ — హా ! దీనరత్నామణీ ! నీపాదసేవతప్ప నన్యమెఱుంగక నిరంతరము ధర్మనాథుడనై యున్న నన్ను రక్షింపఁజాలవా ? కావరావా? బ్రోవలేవా!

భటు — సిద్ధముగనుంటివా?

పురూ — ఆ-

(భటులు-పురూరవుని కరపాదములు ఖండింతురు)

పురూ — హా! దైవమా!

భటు — ఓయయా! ఇకమేము పోవుచున్నాము నీవుద్రొంగతనము చేసితివో లేదో భగవంతునకే తెలియును, రాజశాసనము మేము చెల్లించవలయును గాన నీకిట్లు చేసితిమి మమ్ముమాత్రము దూషింపవలదు.

పురూ — భటులారా! నాకర్మమునకు మీరేమిచేసిరి.

[భటులు నిష్క్రమింతురు]

పురూ — అక్కటా! ఇప్పుడు నేనేమి చేయుదును- ఎక్కడికి బోవుదును పాదములు లేని నేనెట్లునడవగలను? ఇట్టి స్థితిలో నున్న నన్నెవ్వ రాదరింతురు- భగవంతా! నీకు నాయందు గరుణలేకపోయెను కదా! నన్నిట్టి దిక్కుమాలిన పక్షివలె జేసితివే అయ్యో! మొండిశరీరముతో నేను బ్రదికిన లాభమేమి! ఇంతకన్న శరీరమునందు ప్రాణవాయువులు లేచిపోయినచో నేబాధయు లేకుండెడిది!

మ॥ హరి నీవే శరణంబటంచు మదిలో • నాహ్లాదముం బొంది, నీ
చరణాంభోజము లాశ్రయింపగను నీ • చందంబునం నన్నునుం
గరుణం జూడకయుంట న్యాయమగునే • గాపాడవే బ్రోవవే
శరణం బెవ్వరు లేరు దీనజనర • క్షా! దేవా! లక్ష్మీపతీ!

[ ఆకాశమున ]

ఓపురూరవా! నీవు విచారింపవలదు కలిప్రేరణంబున నీ విట్టి బాధలను బొందుచున్నావు విధికృతమును నెవ్వరును దప్పింప జాలరు- నీయాలు బిడ్డలు కొండొక ప్రదేశమున సుఖముగనే యున్నారు వారిని నీవు త్వరలో జూడ గలవు. నీకు గరచరణంబులుగూడ గలుగును శుభ దినములు సమీపించుచున్నవి నాకరుణచే నీకాకలి దప్పులుండవు-

పురూ—భగవతియగు దుర్గాదేవి నాయందుగరుణించి యిట్లు పలుకు చున్నది నాయాలుబిడ్డలు సుఖముగా నున్నారట ఎక్కడనున్న సం గతి మాత్రము తెలుపలేదు తెలుపునుగాక! కరచరణ హీనుండ నగు నేనక్కడ కెట్లు బోవగలుగుదును-

[దేశికసెట్టి ప్రవేశించును]

దేశి—(పురూరవునిజూచి) పాపమితడే కాబోలు రాజుగారి మందిరమున దొంగతనము చేసెనని శిక్షింపఁబడినవాడు పరికించి ఈతనిముఖ మున నదియొక విధమైన యద్వితీయమగు తేజము కనిపించుచుం డుటయేగాక! ఉత్తమకుల సంభూతుఁడనికూడ తోచుచున్నది- సమీపించి విచారించెదగాక (సమీపించి) ఓయీ! నీవేనా చోరు డవని రాజదండనకుఁ బాత్రుఁడవైనవాడవు.

పురూ—అట్టి నిర్భాగ్యుడను నేనే!

దేశి—నీముఖముఁజూచిన దొంగతనముచేసియుందువని నేను తలంప జాలను- సత్కులప్రసూతుఁడవై కాలగతి నిట్టి దుర్దశబొందితివని నాకు సంశయముగనున్నది నీయుదంతము విననగునేని యెఱిఁ గింపుము-

పురూ—ఆర్యా మీరెవ్వరు?

దేశి—మేము వైశ్యులము- నేనీపురమునందే నివసించుచుందును- నన్ను దేశికసెట్టియందురు-

పురూ—ఆర్యా! నేనిప్పుడేమియు జెప్పఁజాలను- నేనెవ్వడనైన నేమి-

ప్రస్తుతమిట్టి దుర్దశాశపాటిల్లినది. ఇదియంతయు నాపురాకృత కర్మము.

శేశి.—సరే నీవువిచారింపవలదు. చీకటికొన్నిదినములు. వెన్నెల కొన్ని దినములు. కష్టములెప్పుడును నిల్లుగట్టుకొని కాపురముచేయవు. నీవు విచారింపక నాగృహంబునకు రమ్ము. నీకు వలసినయుపచారము నాసేవకులు సేయుదురు. నిన్నుజూచిన నాకదియొకవిధమైన యనురాగ ముదయించినది. సంశయింపవలదు. నిన్ను దోడ్కొనివచ్చుట కందలమిప్పుడే పంపెదను. [నిష్క్రమించును]

పురూ.—ఈతఁడెవ్వడో నాపాలిటికి భగవంతుడైనాడు. నేను నెమ్మదిగా జరిగిపోయి యావృక్షముక్రింద నుండునుగాక.

[ నిష్క్రమించును. ]

ఇది చతుర్థాంకము.





# పురూరవ

## పంచమాంకము.

రంగము:- మందిరమునఁ బుష్పవేణి ప్రవేశము.

బుష్ప--ఆహా! ఏమిది! ఇట్టిగానము మున్నెన్నఁడును వినియుండలేదు. సంగీతకళ మూర్తీభవించి యాపురుషుని నాశ్రయించినవిధము తోఁచుచున్నది. అనేకమంది రాజకుమారులనుజూచినను నాచిత్త మెవ్వరిని వరింపదయ్యె. నేడా మహానుభావు డెవ్వడో! అతని సంగీతము వినినయంతనే నాచిత్తము పారవశ్యమునందినది పారవశ్యము నందుటయేకాదు నాహృదయమాతనికి సంపూర్తిగఁజిక్కి మనోరథ సిద్ధినందుటకు దొందరపడుచున్నది. కానిమ్ము అతని యుదంతమారయుటకుఁ బ్రియంవదను బంపియుంటినిగదా! [ఎదుటజూచి] అదిగో అనుకొన్నంతలోనే ప్రియంవద వచ్చుచున్నది.

ప్రియంవద— [ప్రవేశించును]

బుష్ప—సఖీ! ప్రియంవదా! నీవరిగిన సంగతియేమయినది?

ప్రియం—ఏమగును దూరపుకొండలు నునుపు.

బుష్ప—అట్లు బలుకుచుంటివేమి?

ప్రియ—ఏమున్నది! సంగీతపు ఘనయేగాని మఱియేమియు లేదు. నీవు భ్రమించినట్లే అంతటి మహాగాయకు డెవ్వడైయుండురాయని నేనుగూడ భ్రమించితిని. వెళ్ళిచూచునరికి వాసనబయలుపడినది. ఆపురుషునిసంగతి జెప్పుటకు నాకే సిగ్గగుచున్నది.

పుష్ప—రమణీ! సంశయించెద నేను! చెప్పుము?

ప్రియం—మొన్న మనయంతఃపురమున నాభరణముల పేటిక తస్కరించి, రాజుగారిచే కరపాదఖండనశిక్ష విధింపబడిన చోరుఁడే యిప్పుడు పాడినది. అతఁడు దేశికస్వామిగృహమున నున్నాఁడు.

పుష్ప—ప్రియంవదా! ఇదియంతయు నాశ్చర్యముగనున్నది. తస్కరున కేమి! అట్టి గానవిద్యాప్రవీణత యలవడుటేమి? నేను నమ్మజాల. అతఁడెవ్వఁడో యొక మహనీయుఁడుగా నోపు. కారణాంతరముల నిట్టి యవస్థఁబొందియుండును. ఏమైనను నాచిత్తమాతనినుండి తిరుగదు. నే నాతనినే వివాహమాడవలయును. అతఁ డెవ్వఁడో యొక మహాపురుషుఁడుగాకయున్నచో, నిదివఱకెందఱో రాజకుమారులను జెప్పినను, జలింపని నాచిత్తమేల చలింపవలయును.

ప్రియం—(ఎదుటఁజూచి) అమ్మా! మీ నాయనగారు కాబోలు నిట్లు వచ్చుచున్నారు.

(జయంతుఁడు ప్రవేశము)

పుష్ప—తండ్రీ! నమస్కారములు.

జయం—అఖిల శుభప్రాప్తిరస్తు. (ఆసీనుఁడై) అమ్మా! నీవీరీతిని వివాహవిషయమై ముచ్చటించినపుడెల్ల నేదియో సమాధానముఁజెప్పి కాలయాపనము సేయుచుంటివి. ఎంతకాలమని నేనూరకుందును.

గీ॥ పార్వతీనాథుని కృపచేతఁ • బడసినట్టి
నీకు దగురాకుమారుని • దెచ్చిపెండ్లి
జేసి, మోదంబునందంగ • చిత్తమందు
దలఁచియుండఁగ నాకోర్కె • దలఁపవేల

పుష్ప—తండ్రీ నేనేమి చేసితిని

జయం—నీమీఁద కోపముచేత నేను పలుకటలేదు.

తే॥గీ॥ రాజనందను లెందఱో • రమణి! నిన్ను
బరిణయంబొంద నెంచిరి • భాసురముగ
వారిలో నేరికైననను • గోరి గొనక
యుంటి విందుకే కారణం • బో! తలంప॥

కుమారీమణీ! అనేకమంది రాజకుమారుల చిత్ర పటముల దె ప్పించి నీకుఁ జూపించితిని. పెక్కండ్రు రాజకుమారులు నీ కుమారీమ ణిని మాకొసంగుమని లేఖలంపియుండిరి. ఇదియంతయునీకుఁజెప్పితిని నీవెవ్వరిని వరించుటకు సమ్మతింపవైతివి. ఇందులకేమిసేయుదును. పో నిమ్ము. నీయిచ్ఛవచ్చిన రాజకుమారుఁ డెవ్వరో చెప్పుము.

పుష్ప—తండ్రీ! నీవు నాకడకంపిన రాజకుమారుల చిత్రపటము లన్ని యు దిలకించితిని. అది యేమిచోద్యమో నామనం బెవ్వరిపైనను లగ్నముగాకయున్నది.

సీ॥ సరస సంగీత సాహిత్య • శాస్త్రములను
సపర భారతి యననొప్పు • నట్టివాని
బరిణయంబొంద నెంచితే • భావమందు
సందియములేదు జేసికి • తృప్తిలేంద్రా॥

జయం—వెట్టిదానా! మనరాజన్యవరులలో నట్టివా డొందునులేదు. శౌ ర్య ధైర్య గాంభీర్యగుణములే మన రాజులకు ధనము. ఎక్కడనో గాని మనవారిని విద్యవరింపదు. పోనిమ్ము నీవు చూచినవారిలో నె వ్వడైన నట్టివాడున్నాడా?

పుష్ప—ఉన్నచో నింతకుపూర్వమే వరించియుందును.

జయం—సరికదా! ఇప్పుడుచేయవలసిన పనియేమి?

పుష్ప—అట్టివానిని భర్తగా జేకొనుటయే.

జయం—అట్టివాడులేడని నీవుచెప్పియుంటివికదా!

పుష్ప—నీవు నాకడకంపిన చిత్రపటములలోమాత్రములేడు.

జయం—పోనిమ్ము- ఎచ్చటనుండెనో చెప్పుము- వానిందోడితెచ్చి నీకు భర్తగా జేసెద-

పుష్ప—తండ్రీ! నీవుతప్పక నేజెప్పువానికి నన్ను భార్యగా జేసెదవా?

జయం—అమ్మా! నావిషయమై నీవుసంశయించెదవేల? నేను నిరంతరము నీక్షేమముకోరువాడనేకదా!

పుష్ప—జనకా! సంశయమువిడిచి చెప్పుచున్నాను వినుము- నేను నిన్నరాత్రి యిచ్చట శయనించియుండగా, నొకవిధమైన గానప్రవంతి దూరముననుండివచ్చి నా శ్రవణంబులయందు బ్రవహించినది- అది గాంధర్వగానముకాని సామాన్యమైనదికాదు- అంతటి గాయకు డెవ్వరాయని విచారించి, యయ్యుదంతంబరసిరమ్మని చెలికత్తెనుబంపితిని ఈప్రియంవద యరిగినది దేశిక సెట్టి గృహమున నెవ్వడో యొకడున్నాడట అతనినోటి నుండియే యాగానము వినవచ్చినదని తెలిసినది అతని సంగీతము విన్నంతనే నాహృదయ మాతనియందు లగ్నమైనది నానాథుడాతడేయని తలంచి యున్నాను- అను (17)

జయం—అక్కటా! ఇదియేమి! మనయింట నాభరణముల పేటిక హరించిన చోరుడతడు కరచరణంబులు ఖండింపబడగా దేశిక సెట్టి కరుణదలంచి వానిని దనగృహమునకు దోడ్కొనివచ్చి సాకుచున్నాడు- వానినా నీవువరించినది- ఆహా! ఎంతవెఱ్ఱిదానవైతివి-

మ॥ చతురంభోధి పరీత ముద్రిత మహీ ♦ చక్రంబునంగల్గు భూ
పతి సంఘంబు హసింపగా నకట! ని ♦ ర్భాగ్యు నదాచోరునిన్
మతిలో గోరితివేమి! భావ్యమగునే ♦ మన్నింతు రే బంధువుల్
పతియా! భూపతిపుత్రి కాతడు భళా ♦ బాగాయె నీకోరికల్॥

సంగీతమును మాత్రమే చూచి నీవట్లు పలికియుందువు చాలు జాలు నలువురిలో దలయెత్తి మెలగదలచుకొనలేదా? అమ్మా! ఈమాట నెవ్వరైనవిన్న నవ్వుదురనియైనను దలంపక పోయితివేల? నేనేమో

యనుకొంటిని మహారాజ పుత్రికవగు నీవెక్కడ? చౌర్యము చేసిజీవించు నానిర్భాగ్యుడగు నీచకుల సంభూతుడెక్కడ!

తే॥ గీ॥ తగినవానిని వరియించి • యనుగుణముగ
నుభయకులముల సత్కీర్తి • నుర్వియందు
నిలుపవలెగాక, నీరీతి • నీచునొకని
గోరి దుష్కీర్తి పాలుగాఁ • గోరఁదలతె॥

అమ్మా తెలియక కోరితివి ఇంకనా సంగతి నెత్తకుము.
తే॥ గీ॥ మదనసన్నిభుఁడౌరాకు • మారు నొకని
నీకు పెండ్లిగావించి • ప్రాకటముగ
సంతసంబును బొందెద • జింతదక్కి
యుండుమా కుమారీమణీ • యొప్పుగాను॥

పుష్ప—తండ్రీ! నీవెంత చెప్పినను నేనన్యుని వరింపను భాగ్యభోగములఁ జూడను, సౌందర్యమును లక్ష్యపెట్టను నేనిప్పుడు చెప్పిన పురుషుడు చోరుడేయగుగాక! అంగవిహీనుడేయగుగాక! అతఁడే ముమ్మాటికిని నా ప్రాణధవుడు, అతఁడే నాదైవము ఇందులకన్య థాత్వము లేదు. అను (18)
జయం—ఔరా!

తే॥ గీ॥ అంగహీనుని దోడ్తెచ్చి • యాత్మజాత
కిచ్చె నీజయంతు డనుచు • నెల్లజనులు
పలుక, దలయెత్తి యేరీతి • మెలగగలను
కట్ట! యిట్టి దా సంబంధ • గరిమ ! పుత్రి॥

నిన్నట్టి వానికిచ్చి నేను బ్రదికి యుండగలనా ! అనేకమంది రాజన్య చూడామణులు కోరినను నొసంగక తుదకట్టి నీచునకిచ్చి తన

కుమారిని బెండ్లిజేసెనని నృపులాడుకొను వాక్యములకు నేనేమి ప్రత్యుత్తర మిత్తును ప్రత్యుత్తరముమాట కేమి! ముందు నిన్నట్టి వానికిచ్చుటకు నాచిత్తమెట్లు సమ్మతించును.

పుష్ప—తండ్రీ! ఇకనాచిత్తము దిరుగదు. నీవేల యీలీలబలికెదవు. నీకతడు చోరుడుగను, వంశహీనుడుగను గనుపించుచున్నాడు. నాకుమాత్ర మట్లుగాదు. అతడొక మహారాజనియుఁ గారణాంతరములచే నిట్టిప్రచ్ఛన్నవేషమున నున్నాడనియు నాకు నమ్మకము కలదు. అందుచేతనే నాచిత్తమాతనిపైకేగినది. కావున నన్నాతని కిచ్చి వివాహము సేయుము. లోకులునవ్వుదురని నీవు సంశయించి నచో మేమిరువురమును ఈపురముమువిడచి యరణ్యమునకుఁ బోయెదము.

జయం—ఛీ! నాగర్భమున నీవెందుకు జనించితివి. పుట్టకపోయినచో నాకీచింత యుండకపోవునుగదా! ఏమైననూనరే నాచేతులార నీకట్టివానిందెచ్చి కట్టిబెట్టను. నీయిచ్ఛవచ్చినట్లు జేసికొనుము.

[నిష్క్రమించును.]

పుష్ప—ప్రియంవదా! నాతండ్రికెంత యాగ్రహముకలిగినదో కంటివా? అక్కటా! ఇప్పుడు నేనేమిసేయుదును?

ప్రియం—అమ్మా! నీతండ్రి నీక్షేమముకుగోరియేకదా అట్లుచెప్పినాడు. నాయుద్దేశముగూడ నట్లేయున్నది. అట్టి సంబంధము సేయుటకు మీతండ్రికేగాక యెవ్వరికిని జిత్తముసమ్మతింపదు.

పుష్ప—చెలీ! ఈసంగతి నీవునాకు దెలుపవనవసరము లేదు. కాని నాకు ప్రాణసమానవగు చెలికత్తెవుగావున ఈవిషయమున నీవు నాకొక సహాయమును జేసి పుణ్యము గట్టుకొనవలయును.

ప్రియం—నే జేయవలసిన కార్యమెట్టిదో చెప్పుము. తప్పకచేసెద. నీవిషయమునఁ బ్రాణమైననునిచ్చెద.

పుష్ప—సరే! చెప్పెదను రమ్ము.

[ఇద్దరును నిష్క్రమింతురు]

రంగము:—అరణ్యము

[ పురూరవుడు. పుష్పవేశి, ప్రవేశింతురు ]

పు॥ ఉ॥ కోమలి! చేలనాచుబను • గుం జడదారినిబోలు నన్ను నీ
వీ మహిభర్తగా బడసి • యిట్టిదురంతపుచింత నీమహో
ద్యానవనంబులందు నను • దక్కయునందు సుచుంటివయ్యో! ల
క్ష్మీమహనీయమూర్తి! నిను • జేకొనగల్గిన నెంతకొందు దే॥

మ॥ చతురంభోధిపరీతముద్రితమహీ • చక్రంబునందుండు భూ
పతిసంఘంబులవీడి, యీగతిని ని • ర్భాగ్యుండనై యున్న నన్
బతిగా గోరితివేమనందు నకటా • పద్మాస్య! నీకిట్టి దు
ర్గతి నాతోనిటువచ్చియుంటనుగదా • ప్రాప్తించె రామామణీ॥

తరుణీమణీ! నీ వాగర్భశ్రీమంతురాలవు- ఎండకన్నను, వాన కన్నను నెన్నడును నెఱుంగవు- శుద్ధాంతసౌధంబులయందు బరిచారికా సంతతి నిరంతరమును గొలువ భాసిల్లుదానవు-నిరంతరము నందనోద్యాన సమారామ వనములందు చేటీజనంబులుగొలిచిరా విహరించు వారీ మణివి- అట్టి నీవు నిరుపేదను, రూపహీనుడను నగు నన్ను బతిగాగొని యీ భీకరారణ్యభూములకు వచ్చితివి_ నామాటకేమి! నాజన్మ చింత తోడనే జనించినది- ఇప్పుడు నిన్నుగూర్చికూడ నేను చింతింపవలసి వచ్చినది-

సీ॥ మహనీయమణిమయ • మందిరంబులయందు,
నిరతంబు నసియించు • నెలతవీవు
సతతంబు పీతవ • సనముల ధరియించి,
భాసిల్లుచుండెడి • పడతివీవు
అరకాలు తడిగాక • పరిచారికాతతి,
కొలువనాగరాజిల్లు • వెలదివీవు

కడుపార బంచ భ • క్ష్యాన్నంబు భుజియించి,
సౌఖ్యంబుతోఁ దూగు • చానవీవు
తే॥గీ॥ కటకటా నన్ను బతిగాఁగ • గాంచి,
కానలకు వచ్చియుంటివి • కాంత! యెటు
నీదు దుర్గతిం గాంచుచు • నీద నేర్తు
పొంగి పొరలెడి దుఃఖ • సముద్రమిపుడు!

తరుణీమణీ! ఎందఱో రాజకుమారులు నిన్ను వివాహమాడుదు మని చెప్పి, యనేక లేఖలంబంపినను, వారి నెవ్వరిని గైకొనక ఈ నిర్భాగ్యుని ప్రాణేశ్వరునిగా గొంటివి. నాకష్టముల కేమిగాని నీకష్టముల మాత్రము నేను కన్నులారఁ జూడజాలకయున్నాను. నన్ను బతిగా గొనుటచేతనే కదా నీవిట్లరణ్యమున నుండవలసివచ్చినది.

పుష్ప—ప్రాణేశ్వరా! నాకొఱకు మీ రేలచింతించెదరు?

సీ॥ పతిపాదసేవయే • భామామణికి మేటి
భాగ్యంబులనుగూర్చు • పైడిమూట
నిజనాథు సేవయే • నీరజాక్షికి సౌఖ్య,
సంతతిగూర్చు వి • శాలతరువు
ప్రాణకాంతుని సేవ • రామామణికి, మోక్ష
మార్గంబు జూపించు • మంచి త్రోవ
హృదయవల్లభుసేవ • మదిరాక్షికి యశంబు,
నలరింపజాలు జ • యధ్వజంబు

తే॥ పతిపదాంబుజసేవయే • మహితమంగ
ళంబులను గూర్చుచుండును • నంబుజాక్షి
కట్టులగుటచే నిన్నెల్చి • యడవినున్న
నాకు నయ్యది సౌఖ్యమే • నాథవినుమ॥

మీతో గలిసి చరించుటకన్న నాకుగావలసిన భాగ్యమేమున్నది. నాకు సౌఖ్యభోగములతోఁబనిలేదు. భాగ్యములతో బనిలేదు. నేనునిరంతరము మీచరణసన్నిధి నుండకోరుచుందును. మీసేవయే నాకు సకలాభీష్టఫలప్రదము. నాథా! ఇక నొకమాట. మనకష్టము లెప్పుడును నిక్లేయుండవు. మనకు మంచిదినములు తప్పక త్వరలోవచ్చునని నేను ధ్రువముగఁజెప్పఁగలను. కావున మీరు విచారముడిగి ధైర్యచిత్తులై యుండుడు.

[ ఆకాశమున ]

బిడ్డా! నేను సరస్వతిని. నాకృపవలన నీ కాకలిదప్పు లడంగి నవి కదా నీవు దుఃఖింపవలదు. ఈ సమీపమున నీకొఱకు నొకపురము దైవికపురమను నామంబున రాజిల్లునది. విశ్వకర్మచే నిర్మింపఁజేసితిని. నీవు దానికి దైవికమహారాజనుపేరున నభిషిక్తుడవగుము. నీవుసర్వశుభంబులను బొందగలవు. నీభార్యాపుత్రులను జూడగలవు.

పుష్ప—ఈవాక్యము లెవ్వరివి?

పురూ—తరుణీ! ఆమె సరస్వతీదేవి ఆమెకటాక్షముననే నాకాకలి దప్పు లడఁగినవి. ఖండింపఁబడిన కరచరణంబులుగూడ వచ్చినవి.

పుష్ప—నాథా! భార్యాపుత్రులను జూడగలవని యాతల్లి వక్కాణించినదే. ఈ విషయమేమి?

పురూ—[ మాట్లాడక యూరకుండును ]

పుష్ప—ప్రాణేశ్వరా! ఈమాటయడిగినంతనే మొగము దీనతవహించినదేమి? నేను వినగూడని విషయములేమియున్నవి.

పురూ—అయ్యో! నీరుద్ధరహస్యమా! ఎంతమాటఁబలికితివి. నాదీనస్థితియంతయు నీకు నెమ్మదిగాఁజెప్పెదను రమ్ము. భారతీదేవి యాజ్ఞ ననుసరించి యప్పురంబునకు బోవుదము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

రంగము.—చెంగిగృహము

[ ప్రవేశము—సత్యవంతుఁడు, ధర్మశీలుఁడు, చెంగి ]

చెంగి—కుమారులారా! మీ సాహసప్రవనులు చూచినప్పుడెల్ల నాకు భయముకలుగుచుండును. నేననేకసారులు మీ రరణ్యములకు బోవవలదనియు, దుష్టమృగములయెదుటకు నిర్భయముగా నడుగవలదనియుఁజెప్పితిని కాని మీరు నామాటలువినరైతిరి-నాకు సంతానము లేకపోయినను భగవంతుఁడునాకు మీయట్టివిధముగా ననుగ్రహించి నందుకు నాపంచప్రాణములు మీమీదబెట్టుకొనియున్నాను.

సత్య—అమ్మా! నీవు మావిషయమై చింతింపఁబనిలేదు. మాకు మృగ-శిమ్మృగములవలన భయములేకపోవుటయేకాక, యుద్ధములకుకూడ నెట్టివీరులువచ్చినను వెనుదీయము.

ధర్మ—తల్లీ! దైవికపురపాలకుండగు దైవికమహారాజు నిరంతర సత్యవ్రతాచారపారీణుడనియు, ధర్మసంధుడనియు వినియుంటిమి. ఇప్పుడాతని సైన్యములునడుపుటకు దగిన సేనానాయకులు గావలయునని వినియున్నాము. మేము నెమ్మదిగా నాతనిందర్శించి యాతనికొలువు వడసెదము.

చెంగి—బిడ్డలారా! సుకుమారశరీరులగు మీకొరకి కొలువున నుండనేల? కొద్దియో గొప్పయో గొరులనుజేరి యాచింపకుండ భగవంతుఁడు మనకిచ్చియున్నాడు. నేనుమాత్ర మెవ్వరికి బెట్టుదు నాయనలారా! ఇదియంతయు మీయదికాదా! హాయిగ నున్నది తిని స్వేచ్ఛగా దిరుగుఁడు.

ధర్మ—అమ్మా! ఉన్నది తినుట యదియొక గొప్పగుణమా! మేమెవ్వరమో! నీవెవ్వరవో, మాయందుగృపయుంచి యిన్ని దినముల నుండియు గన్నబిడ్డలకంటె బెంచి పెద్దవారిగజేసి విద్యాబుద్ధులు చెప్పించితివి ఇంచుక కాయకష్టపడి స్వార్జనాపరులమై యశము గడింపవలయును. కావున మేమా మహారాజుసన్నిధిని కొలువుండుట కాజ్ఞనిమ్ము.

సత్య—అమ్మా! మీమింటఁ దినుచుఁగూర్చున్న మాశౌర్యధైర్యములు లోకమున కెట్లు ప్రకటింపఁబడును- మానవుడు జన్మించినందులకేదియో యొక మహాకార్యమొనరించి యశమందవలయును గదా! మే మున్నతోద్యోగములవహించి కీర్తిఁగొనుట నీకుఁగూడ కీర్తియేకదా! కావున మాయందుదయయుంచి దైవికమహారాజు సన్నిధి కేగుటకు శలవిమ్ము-

చంగి—కుమారులారా! మీసంతోషమునకు నేనేల భంగమొనరింప వలయును- సుఖముగా బోయిరండు- మీకు శుభముగుగాక!

[ అందరు నిష్క్రమింతురు ]

రంగము :-[దైవికమహారాజు కొలువుకూటము

[ప్రవేశము దైవికమహారాజు—మంత్రి]

దైవి—మంత్రివర్యా! ప్రజలు నాపరిపాలనమును గురించి యేమని చెప్పుకొనుచుండిరో కదా!

మంత్రి—దేవా! మేమెన్నడును నిట్టి సద్గుణవంతుడును ధర్మసంధుడును సత్యవ్రతాచార పారీణుడును నగు మహారాజును నెచ్చటను జూచియుండలేదు ఈతడీ పురపాలనంబునకుఁ గడంగిన నాటనుండియు దేశమున క్షామమెఱుఁగము రోగములేవుఁ పాడిపంటలు వృద్ధిగానున్నవి అని చెప్పుకొనుచుండిరి.

సేవకుడు—[ప్రవేశించి] మహారాజా! దేవరవారి సందర్శనార్థమై ద్వారము కడ నిరువురు బాలురు వేచియున్నారు.

దైవి—శీఘ్రముగ లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము [నిష్క్రమించి వెంటనే సత్యవంత ధర్మశీలురతో బ్రవేశించును]

సత్య-ధర్మ—మహారాజా! వందనములు.

దైవి—[తనలో] ఈకుమారులెవ్వరు? వీరితేజ మద్వితీయముగ నున్నది వీరిరువురును నశ్వినీకుమారులవలె కంతు జయంతులవలె- విరాజిల్లుచున్నారు వీరింజూడగనే నాకొక తీరైన యనురాగము వొడముచున్నది. (ప్రకాశముగా) బాలకులారా! మీరెవ్వరు! ఎందుండురు! ఇచ్చటి కేమిటనిమీద వచ్చితిరి.

సత్య—మహారాజా! మేమొక యాభీరవనితచే బెంపఁబడినవారము, అన్నదమ్ములము.

తే। గీ। దైవిక నృపాలచంద్రుండు • ధర్మపరుడు
న్యాయశీలుండటంచు • నఖలజనులు
చెప్ప గావిని, సన్నును • జేరి కొలువ
వచ్చినారము ముదమున • వార్ధి వేంద్ర।

ధర్మ—తమకొలువుకూటంబున నుండ మాకె లయుఁ గుతూహలమగుచున్నది. కరుణించి మీసేవ మాకొసంగనచో, మీకుమాయుంను విధించుకృత్యముల యందు శక్తివంచనలేకుండ మీకుఁ దృప్తిగొలు సంగుచు మెలంగగలము.

దైవి—బాలకులారా! మిమ్ములను నాయాస్థానమున నుంచుకొనుట కెంతయు సంతోషమగుచున్నది (మంత్రిని జూచి) మంత్రీ! వీరికి దగిన యుద్యోగ వ్యాపల నాలోచితము ముందువీరికి భోజనాది సదుపాయములఁ జేసిరమ్ము

మంత్రి—చిత్తము బాలకులారా! రండు
[బాలకులతో నిష్క్రమించును]

దైవి—(తనలో) ఈ కుమారు లెవ్వరై యుందురు.

చ॥ మనసిజ రూపచారు సుకు • మార కుమారుల వీరి జూడనా
తనయులె యౌదురా యనుచుఁ • దద్దయు దోఁచెడిచిత్తమందు
[ఇంచుక యూరకుండి] హా
వనముల నాశ్రియఁగ సుతుల • భార్యను వీడుచు వచ్చినట్టి దు
ర్జనునకు నట్టి భాగ్యము వి • రాజిలునే తలపోసిచూడఁగన్

నాకుమారులను, తలోదరీ మణియగు జయప్రదను జూచు భాగ్యమున్నదే! మొన్న సరస్వతీదేవి నీకు శుభదినములు సమీపించుచున్నవనియు ఆలుబిడ్డలతోఁగూడి యానందింతువనియుఁ జెప్పియున్నది కదా ఏమో! ఆలోచించగా వీరునా కుమారులే యని తోఁచుచున్నది.

[నవకోటి నారాయణసెట్టి ప్రవేశము]

నవ—[తనలో] ఎంతప్రయత్నము జేసినను ఎవ్వరికి జూపించినను నా పెట్టెమూత తెరచుటకు శక్యముగాకయున్నది. దైవికమహారాజు మహామహిమగలవాడని విన్నాను. ఈ మహానుభావునితో నాసంగతి విన్నవించుకొని కార్యసాఫల్యముఁబొందెదనుగాక! [ప్రకాశముగా] దైవికమహారాజా! నీకు జయమనుగాక!

దైవి—అయ్యా! నీవెవ్వడవు?

నవ—మహారాజా! నేను వైశ్యుడను నన్ను నవకోటి నారాయణసెట్టి యందురు. నేనొక కార్యార్థినై దేవరసన్నిధికివచ్చితిని. ఆకార్యము దీర్ప మీరుసమర్థులు.

దైవి—వైశ్యరత్నమా! ఇటఁజెప్పెదను నారులకు శక్తియున్నంతవరకు నుపకారము సేయువాడని యెఱుంగుము. పరోపకారమునకే నాశరీరము ధారవోయదలచినాను. నీయభీష్టమెట్టిదో చెప్పుము. సాధ్యమైనదేని తప్పకతీర్చెదను.

నవ—మహారాజా! చల్లకువచ్చి ముంతదాస్తేలాభమేమిటి. నూరండి నాదగ్గిఱ సిరకాలమునుంచి ఒకపెద్దపెట్టెవున్నది. అది మూతపడి

పోయింది. ఎంతమంది ప్రయత్నంచేసినారాదు. అబ్బా! సకల కష్టాలుపడ్డాము. తమరు సాలాప్రభావంకలవారని యిని యీపని మీవల్ల కావాలని, కావాలనేవిటి తప్పకుండా అవుతుందని యిటొచ్చాను. మీాసిత్తం. తమరెల్లాసెప్పితే అల్లా నడుచుకొంటాను.

దైవి—నీమాటలు మిగులవిచిత్రముగనున్నవి. పేటికయొక్క మూత రాక పోవుటయేమి?

నవ—అబద్ధంసెప్ప లేదు. సిత్తగించండి.

దైవి—అట్లయిన నా పేటికను మాకొలువుకూటమునకు గొనితెమ్ము. చూతము.

నవ—సిత్తం మధ్యాహ్నం పట్టుకొత్తానండి.

దైవి—మంచిది. మాకును వేళయైనది.

[నిష్క్రమింతురు.[

ఇది పంచమాంకము.





# పురూరవ

## షష్ఠాంకము.

రంగము:—దైవికమహారాజు కొలువుకూటము.

[ ప్రవేశము- దైవికమహారాజు, నవకోటి నారాయణసెట్టి,
ఇరువురు బాలకులు. ]

దైవి—ఏమి! నారాయణసెట్టీ! పేటికయొక్క మూత యేమయిన సాధ్యమైనదా?

నవనారా—మహారాజా! లేదు- అనేకమంది ప్రయత్నముచేసినారు. మీ దండనాయకులగు బాలకులుకూడ గట్టిప్రయత్నముచేసినారు లాభము లేకపోయినది.

దైవి—[ బాలకులంజూచి ] సేనానాయకులారా! మీకుఁగూడ నా పెట్టెమూతదీయుటకు సాధ్యముకాలేదా?

ధర్మ—చేయవలసిన కృషియంతయుఁ జేసితిమి. సాధ్యముకాలేదని చెప్పుట కెంతయు విచారమగుచున్నది.

దైవి—అట్లయిననాపేటికను ఊరివెలుపలనున్న కమలాకరంబునఁ గొన్నాళ్ళుంచి మీరు భద్రముగా గాపాడుచుండుడు. తరువాత కర్తవ్యము నాలోచింతము.

సత్య }
ధర్మ } చిత్తము.

దైవి—వైశ్యుడా! నీవుకూడ వెంటఁబొమ్ము.

( ముగ్గురు నిష్క్రమింతురు.

దైవి—ఇది కడువింతగనున్నది. దీనింగూర్చి యోచించవలెను.
(నిష్క్రమింతును.)

రంగము:—కమలాకరతీరమున

(సత్యవంతుఁడు, ధర్మశీలుఁడు, ప్రవేశము.)

ధర్మ—అగ్రజా! ఇది యేమి! ఈ పేటిక నీరములయందెన్నిసారులు వేసినను నిలువక నిముష నిముషమునకు గట్టునకు జేరుచున్నది.

సత్య—నేనును నదియే యాలోచించుచున్నాను.

ధర్మ—ఈ పెట్టెయందేదయిన పిశాచమున్నదేమో! యిదినాకు సంశయముగనున్నది. కాకున్న మూతతెఱచుట కెంతప్రయత్నము చేసినను రాకుండుట యేమి! ఆయుధములన్నియు మొక్కపోయి నవిగాని పెట్టిమాత్రము పగులలేదు.

సత్య—ఏదియెట్లున్నను, దీనిని గాపాడలేక మనము నానాకష్టములఁ బొందుచున్నాము.

జయప్రద—[పెట్టిలోనుండి] కుమారులారా! మీకష్టములు తొలగు కాలము వచ్చినది. ఎవ్వరుప్రయత్నముచేసినను ఈ పెట్టెమూతను తెఱువఁజాలరు. నానాథుఁడు స్పృశించినంతనే మూతవచ్చును. నేను బయటికివత్తును. కావున మీరీపేటికను మీరాజుగారిసన్నిధికిఁ గొనిపొండు.

ధర్మ—అన్నయ్యా! చూచితివా చిత్రము.

నవ—[ప్రవేశించి] బాలకులారా! ఏమి! ఈ పెట్టెగట్టునకువచ్చినది? మీరు జాగ్రత్తగా గాపాడుచుండ లేదా?

సత్య—మమ్ముల నేమినేయమందువు. ఇక మేమీ పెట్టెను గాపాడ లేము. రాజుగారిసన్నిధికిఁ దీసికొనిపోవుదుము. వలసినయెడల నీవు గూడ నటకురమ్ము.

[అందరు నిష్క్రమింతురు.]

[రంగము:—దైవికమహారాజు కొలువుకూటము
దైవికమహారాజు, సత్యవంతుడు, ధర్మశీలుడు, నవకోటి
నారాయణసెట్టి, ఒకప్రక్క పెట్టెయుండును]

దైవి.—బాలులారా! మీరు చెప్పినవాక్యములు మిగుల వింతగనున్నవి. పేటికనుండి మాటలు వినవచ్చుచున్నవా?

సత్య—అయ్యా! మే మసత్యమాడుదువా?

[ఉపరిచమహర్షి ప్రవేశించును.]

దైవి—మునీంద్రా! వందనములు.

ఉప—శుభప్రాప్తిరస్తు.

దైవి—తాపసోత్తమా! భద్రాసనము నలంకరింపుము.

ఉప—[ఆసీనుడై] రాజా! ఏదియో ఆలోచించుచున్నారే?

దైవి—మహాత్మా! ఏమిచెప్పుదును. ఈతడొక వైశ్యుడు. చిరకాలము నుండి తనయొద్ద నొకపెట్టెయున్నదట. దానిమూత వచ్చుటలేదని నాకడకు గొనితెచ్చినాడు. ఎంత ప్రయత్నించినను మాకుసాధ్యము కాదయ్యెను. నీటియందుగూడ వేచిన నీవలనవచ్చుచున్నది.

ఉప—[నవ్వును]

దైవి—మహాత్మా! అట్లు నవ్వుటకేమి?

ఉప—[కోమటిజూచి] ఓయీ! వైశ్యుడా! నేనడిగిన ప్రశ్నంబులకు నసత్యమాడక ప్రత్యుత్తరమిమ్ము.

నవ—అబ్బో! మునులొద్ద అబద్ధమే. కొంపంటుకోదు.

ఉప ఈపెట్టె నీవద్ద నెన్నిసంవత్సరములనుంచి యున్నది?

నవ—నేను పుట్టినప్పటినుంచి.

ఉప—అప్పటినుంచియు మూతరాకుండ నేయున్నదా?

నవ—అబ్బే! ఈమధ్యనుండే రావడంలేదు.

ఉప—ఇందులో నెవ్వరైన నున్ననంగతి నీకేమైన తెలియునా?

నవ—పెట్టెలో ఎవ్వరుంటారు బాబూ. [తనలో] అబ్బో: ఈయన శానా ప్రశ్నలేస్తున్నాడే!

ఉప—వెనుక నీవు చెఱువుత్రవ్వించునపుడు నీదగ్గఱకు భృత్యములు తీసికొనుటకువచ్చిన కరిణీకునిభార్య యేమయినదో తెలియునా?

నవ—నాదగ్గిఱకొచ్చి వెళ్ళిపోయింది.

ఉప—ఆమెను నీవేమైన గోరితివా- లేదా?

నవ—చివ శివా.

ఉప—అబద్ధమాడకు-

నవ—మునీశ్వరుఁడంతా గ్రహించేశాడు. ఏంకొంపమునుగుతుందో!

ఉప—నీవీ పెట్టెయున్న గది కగ్నిపెట్టలేదా? సముద్రమున బాఱ వేయించలేదా? అసత్యమాడకు. అసత్యమాడితివేని శపించెద-

నవ—చిత్తం బాబయ్యా!

ఉప—నీకడకు భృత్యమునకై వచ్చినకాంతపై మరులుగొనికదా నీ వట్టి కార్యము జేసినావు-

దైవి—మునీంద్రా! ఇదియంతయు వింతగానున్నది-

ఉప—వింతయేమున్నది. ఈచేరి గృహమునకువచ్చిన యా సుదతినిగోర నామె యీ పేటికయందు ప్రవేశించినది- ఆమె సాధ్వీమహిమచే నా ధునకుదప్ప మఱియొకరికీమాత్ర రాకుండఁ జేసినది- రాజేంద్రా! ఈ పేటికయందున్నది నీ యర్ధాంగియగు జయప్రదయే- నీ కరంబున స్పృశించితివేని యామె యీవలకువచ్చును- వీరు నీతనయులు-

దైవి—ఆహా! ఏమీ! నాభాగ్యము

గీ॥ కానలో నిశిం జనెడు మా • ర్గాటు డెలమి
దీపికనుగాంచు భంగిని • ధీర చరిత
నాదు మానసం బిప్పు డా • నంద మందె
కలరె ననుబోలు ధన్యులు • క్ష్మాతలమున॥

(కుమారులను కౌగలించుకొని) కుమారులారా!

గీ॥ ముద్దుగొమరులు మీరంచు • బుద్ధిలేక
సేవకా వృత్తిసో మిమ్ముఁ • జేర్చినాను

దైవ మనుకూలు డయ్యెను • తపసి కతన
సంతసము జనియించెను • స్వాంతమునకు॥

వత్సలారా! ఆనాడు ప్రవాహముదాటబోయి మిమ్ము తీగెలకుం గట్టి నే నేటబడి కొట్టుకొనిపోయితిని. మీ రెచ్చటనుంటిరో మీ జాడ శాలి యొక మహాదుఃఖసాగరమున మునిగి పరితపించుచుండ నేటికి నాభాగ్య వశమున మిమ్ములగాంచితిని.

సత్య—తండ్రీ! మా యమ్మను జూచుటకు మా చిత్తములు తత్తరమందు చున్నవి.

ఉప—రాజేంద్రా! ఈపేటికను స్పృశించుము.

దైవి—[పెట్టెను ముట్టినంతనే జయప్రద యావలకువచ్చును]

జయ—నాథా! నమస్కారములు.

పురూ—ఎన్నాళ్ళకుఁ జూచితిని.

నవ—నాకొంప మునిగింది. నన్ను గొంతుక పిసికేస్తారుకాబోసు. ఓరీ! దేవుడా! ఎందుకిల్లాటి తప్పుపని చేశానురా!

జయ—నాథా! మీ దివ్యమంగళవిగ్రహ సందర్శనము నా కన్నాళ్ళకు లభించినది.

నవ—(భయముచే నిటు నటు పరుగెత్తును)

ఉప—వైశ్యుడా! భయమందకుము. ఈయన పురూరవచక్రవర్తి, ఈ యమ్మ జయప్రద. కాముకుఁడవై దుష్కార్యమొనరింపదలచిన నీవు దండింపబడవలసినవాడవైనను నీకీతడ భయమిచ్చును. భయ ము విడువుము.

పురూ—రమణీ! నేనుపడిన యవస్థ లేమని తెలుపుదును. నిన్ను గాంచ లేక చింతింపుచు, బిడ్డలను వెంటఁబెట్టుకునివచ్చి మార్గముననొక సెలయేరుదాటదలచి కొట్టుకొనిపోయితిని. అనంతరము గోష్ఠిలకా పరినై యుండ జయంత నృపాలుని యంతఃపురముననుండు ఆభరణ

ముల పేటిక తస్కరించితినని దోష మారోపింపఁబడి కరపాదఖండ నశిక్షఁబొందితిని. అనంతరము జయంతుని పుత్రికయగు పుష్పవేణిచే వరింపఁబడి, సరస్వతీదేవి యనుగ్రహమున నీపురనాథుడనై దైవికు డనుపేరున బరఁగుచుంటిని.

పుష్ప—(ప్రవేశించి) అక్కా నమస్కారములు

జయ—[ కుమారులనుజూచి ]

సీ॥ తలిదండ్రులను వీడి • పలుదుఃఖముల నెట్లు
వంతల నెచ్చోట • బడితిరయ్య
కన్న బిడ్డలరీతి • కరుణా రసంబున
మిమ్ముల నెవ్వరు • పెంచిరయ్య
ఏతల్లి మీకు సం • ప్రీతి విద్యల గఱ
పించి సమ్మోదమును • గాంచె నయ్య
అయ్యొ రొుద్దను గొల్వ • సమరంగ భావించి
యేరీతి నిమ్మేడఁ • జేరి రయ్య
గీ॥ కటాకటా భాగ్యవంతుల • కాను వయ్యు
యురిపై నెట్టి యిక్కట్ల • నొంది రయ్య
ఏది యేమైన మిమ్ముల • నింపుమీర
గాంచ గంటిని భగవంతు • కరుణ వలన॥

సత్య—అమ్మా ! ఏటిగట్టుననుండి మమ్ము చెంగియను వ్రజాంగన గృ హంబునకు దోడ్కొనివచ్చి పెంచి విద్యాబుద్ధుల గఱపించినది.

జయ—ఆమె ఋణమునేను సహస్ర జన్మములకైనను దీర్పజాలను.

[ తెరలో ]

పురూరవా! నేను కలిరాజును నీసత్యపరీక్షకై నీకిట్టి కష్టముల గల్పించితిని నేటితో నీకష్టములు తీరినవి. ఇంకనీవు నీపురమునకు

బోయి సుఖముగా రాజ్యము బాలించుకొనుము నీరాజ్య మాక్రమించిన యరిరాజు మృతినందినాడు నీపేరుతలంచినవారికి నావలన బాధకలుగ కుండ వరంబిచ్చినాను.

పురూ—మహాప్రసాదము [ఉపరిషుని జూచి] తాపసోత్తమా! మాకడగండ్లు తీరినవి మీ యనుగ్రహమున. భార్య పుత్రులఁ జూచితిని ఇంకగావలసిన దేమున్నది ఇంద్ర పురమునకు బోయి సత్యవంతునకు బట్టాభిషేకము తమ సన్నిధియందు జేసెదగాక!

ఉప—అవశ్యము.

తే। గీ। పుడమి సస్యసమృద్ధియై • పొలుచుగాక
నిజముగా విభు సేవయే • నిలత నెపుడు
నాపదలనుండి రక్షించి • యలరుగాక
పుడమి నీపేరువినఁ గలి • పోవుగాక॥

(సత్యవంతుని పట్టాభిషేకము జూపవలయును)

ఇది ష ష్ఠాం క ము.

సర్వము సంపూర్ణము





# పురూరవ

## అనుబంధము:—

### అను- (1)

చింతయేల నీకు - నింతగా - మదిని ।కాంతా।
వంతసంబు నీకు గలగ - భూకాంతుడా పురూరవుండు
వింతగ జసుడాచి నిన్ను - వేడ్కను గొనిచను ।చిం॥

### అను- (2)

వారే - వహ్వారే - వయ్యారితీరు ।
నారీమణి - బోలు వారి - నెట - నీకేను లోకముల
గాంచి యెఱుగ ।।వారే।।
వరీ - ధన్యుల జేయా - గోరి - మారి - ధాత -
నారి - సృజియించె - నా కౌరా ।వా॥

### అను- బం (3)

సాకీ— హేసకల సద్గుణంబులకు నాస్థానమైన భూపాలులారా ।
హేసర్వేశపద జలజచింతనంబున నెగడు పుణ్యులారా ।
మామకసుత స్వయంవర వైభవముచుగన
సరగున నరుదెంచిన మిముగని ముదమందితి ।హే।

అను- (4)

ఎట్టులేరదో - నృపా - మాపట్టీని - నీ ।వెట్టు।
పుట్టిననాటగోలె - మముబిడిచి యెఱుగదు దీని ।నెట్టు।
రట్టు పెట్టదు - పట్టు - పట్టదు-
గట్టిగా మాటాడ - గన్నుల నీరువిడుచు ।ఎట్టు।

అను- (5)

బాలా! ఈలీల - శేలవై - గుండదేలా ।
పాలించు - నిను - ప్రాణతుల్యగ - భూపాలుడు ।బా।
లాలించు - మేలెంచు - కరుణించు -
సంచితకృప, బూని - శాంతుడు ।బా।
పూర్వభవ - పుణ్యమున - నుర్వపాలుడు నీకు
పర్వేందువదన - ప్రాణేశుడయ్యెను ।బా।

అను- (6)

ఈవన రమణీయత గనుమా - యింతీ॥
భావంబెల్లెడ - రంజిల్లగ - నలుదెసలంగాంచిన
మల్లెలు - విరజాజులు - సంపెగలుఁ గలిగిన ఈ ।వన।
డెంతంబున నానందము గూర్పగా-
మందమారుతమదె - హాయిగ వీచుచున్నది ।ఈ।

అను- (7)

అరి నృపులందఱు నేకంబై -
సరగునన - పైకగుదెంచిరిగా ।అ।

దురితరతులన్ - భయదసంగరమున
భీకర కరాసిః - చీల్చెదః-గాల్చెదః-ఢొల్చెదః శిరములః ॥అ॥

అను- (8)

ఎంతకఠిన వార్త - వినిపింపగనయ్యోను ॥ఎం॥
ఇంతదీని విన్నసెటుల దలచునో - వగచునో ॥ఎం॥
సుంతయేని కరుణలేక - భూకాంతులెల్ల
పురమువిడిచి పోవ నాజ్ఞనిచ్చిరిగా ॥ఎం॥

అను- [9]

ఇదియేటిమాట - నాథా-
సదమలాంగికి - పతిసేవ రతనాలమాట ॥ఇది॥
ఒకనిముసమైన - మిమ్ముగ్విడిచి - యుండగలనె-
దలచువేల నామదిని - కాయజాలనిను - నెనువెంట నరుదెంతు ॥ఇ॥

అను- [10]

హే దేవాది దేవా- దివ్యప్రభావా!
కాపాడరావా - కమనీయభావా ॥హే॥
సతతంబు నీపాద - సారసంబుల నే
మతిలోన నిల్పి - మనుచుంటిగాదే ॥హే॥
రాజ్యంబువీడి - రమణినిగూడి - పుత్రులతోడి
విపినాళికేగు నను - బ్రోవగ రమ్ము ॥హే॥

అను- [11]

ఇంతచింత కలుగుననుచు - నెన్నడెఱుగనైతిగా ॥సతీ॥ఇ॥
పంతమూని - భారతీ - కాంతుడిట్లు
నొసటవ్రాసెగా ॥ఇం॥

మణిమయ సౌధంబుల - బరిచారికలుగొల్వ-
మహిమదనరు - మగువను నిను-
కానకుఁ జేర్చితిగాదే ॥౧౦॥

అను (12)

అన్నా! నామనవి వినుమన్నా - నీకిదితగ దన్నా ॥అ॥
పరకాంతరతి యన్నా - పాపంబునకును మూలంబన్నా-
క్షమియింపుమన్నా - సత్పథముస జోవన్నా ॥అ॥

అను- [13]

సాకీ:—పర కాంతారతి మానసునకు-
ముక్తి దూరంబూ-
పరకాంతలగోరుట కను పాపంబూ-
పరులెవరైనను వినినను - భయమొదవును - నిజ
తరుణి మెలంగిన - సంసారముగూలును ॥ప॥

అను- [.4]

అంబికా - కాత్యాయనీ - అంబ - దాక్షాయణీ
శాంభవీ - కరుణఁజూచి బ్రోవుమీ ॥అ॥
ఈ పేటియందు నిలచుచుంటి - దల్లీ-
ఆశ్రితకల్పవల్లీ - అభయమిచ్చి బ్రోవు కృపజల్లీ ॥అ॥

అను (15)

ఎందుంటివో - సుందరధవ
డెందమందు గుందునన్ను గనగరావు ॥ఎం

నీచవృత్తియందు - నిన్నుకొట్టినాతవని
మనను గోసినన్ను బాసినావ ||ఎం||

అను (16)

ఇంతకనికరము లేదా - శ్రీదా ||నాపై||ఇం||
సుంతయైన నాదుస్థితి - జూడకుంటివేమి ||ఇం||
వాదా - రాదా - దయనాపై
నీవె దయనుజూడకున్నా నా - కేదారి ||ఇం||

అను- (17)

ఇదితగునే తరుణీ - అంగవిహీనుని - చోరుని
పతిగాగోన దలచితివిది ||తగు||
జగములు దీనిని విన్నను - నగరే -
అగునా - మగువా - తగవా ||ఇ||

అను (18)

వినుమా - జనకా - ఇదితగు నాకిక
అనుమానమేల - నాకతడే పతి ||వి||
కినుకిక - విడుమా - ముదమున నన్నిడుమా
యతనికిక - ముదమునుగనుమా ||వి||



# నాటకములు.



| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ రామాయణం | 1-4-0 | ఉషాపరిణయము | 0-8-0 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1-4-0 | శ్రీరామపట్టాభిషేకము | 1-0-0 |
| సంపూర్ణాంజనేయము | 1-4-0 | కనకతార | 0-12-0 |
| మహాభారతయుద్ధము | 1-4-0 | శివాజీవిజయము | 1-0-0 |
| చిత్రనళీయము | 1-4-0 | శంభుకవధ | 0-12-0 |
| సీతారామవియోగము | 1-0-0 | రామరావణసంగ్రామము | 1-0-0 |
| లంకాదహనము. | 1-10-0 | పాండవాజ్ఞాతవాసము | 0-12-0 |
| శశిరేఖ | 0-12-0 | మగసేన | 1-0-0 |
| సతీతులసి | 1-0-0 | కృష్ణరాయబారము | 0-12-0 |
| కబీర్ దాసు | 1-0-0 | మహానంద | 1-0-0 |
| సక్కుబాయి | 0-14-0 | పాంచాలీపరిణయము | 0-2-0 |
| ప్రతాపరుద్రీయము | 1-4-0 | రసపుత్రవిజయము | 1-0-0 |
| రాధాకృష్ణలీల | 0-12- | రాణా ప్రతాపసింగు | 1-0-0 |
| సావిత్రి | 1-0-0 | ప్రతాపసింహ | 1-4-0 |
| సత్యహరిశ్చంద్ర | 0-12-0 | రాణీసంయుక్త | 0-8-0 |
| పద్మవ్యూహము | 1-0-0 | సతీ అనసూయ | 1-0-0 |
| భక్తతుకారాం | 1-0-0 | జయంత జయపాలము | 0-12-0 |
| హనుమద్రామ సంగ్రామము | 0-12-0 | కృష్ణతులాభారము | 0-12-0 |
| నరవిక్రయము | 1-4-0 | రాధాకృష్ణ | 1-0-0 |
| సీమంతిని | 1-0-0 | రామదాసు | 1-0-0 |
| సతీసక్కు | 0-12-0 | గయానాటకం | 1-0-0 |
| కృష్ణలీల | 1-0-0 | విజయభాస్కరము | 1-0-0 |
| కాంతామతి | 0-12-0 | | |

వలయువారు:—

## మహంకాళి అండ్ కో, బెజవాడ.

# బాలచంద్ర

వీరరస ప్రధానమగు కష్టాంత నాటకము!!

గ్రంథకర్త:- బద్దిరెడ్డి కోటీశ్వరరావు

బాలచంద్రుని ధైర్యస్థైర్యము, దేశాభిమానము, దేశాభ్యుదయసాధనము; రణోత్సాహము; ప్రతిజ్ఞానిర్వహణము చదువుచున్నకొలది భయాశ్చర్యసంభ్రమములు కలుగజేయునవి నారీపిశాచియగు నాగాంబక్రూరత్వము; దేశాభీష్టమునకై పన్నిన పన్నుగడలు; దురుద్యోగము: రణకౌశలము చదివి తీరవలయును. బ్రహ్మనాయునిశాంతము; పరోపకారపారీణత్వము; ఏకమత్యసంబోధము, రాజనీతి వర్ణింపనలవికాదు పద్యములు చదివినకొలది మేన పులకలు జనించును. గద్య వీరావేశము గలిగించును అచ్చులోనున్నది. త్వరపడినగాని ప్రతులు దొరకవు.

వెల 1-4-0

ప్రకటించువారు :—

మహంకాళి అండుకో,

బుక్కు సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

బెజవాడ

